8-1-1993 శుక్రవారం 10 పేజీలు సంపుటి : 64 సంచిక :2 విడిప్రతి : రు. 2.00 లు    Regd. No. H.N.L. 18

# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకటరామానాయుడు



# నెల్లూరు బంగారు బజారు గడగడలాడింది!

హైదరాబాదు, గుంటూరు నుండి దండెత్తి వచ్చిన ఇన్‌కంటాక్స్ ఇంటలిజెన్స్ డైరెక్టరేట్‌కు చెందిన సుమారు ఎనభై మంది ఆఫీసర్లు, సిబ్బంది 6,7 తేదుల్లో నెల్లూరు బంగారు బజారును గడగడలాడించి వేశారు. 8తేది కూడా ఈ బృందం నెల్లూరులోనే వుంది. వచ్చిన బృందంలో పదహారుమంది మహిళా అధికార్లు కూడా వున్నారు. కొందరు కార్లలో, ఎక్కువ మంది టూరిస్టు బస్‌లో దిగారట.

6తేది మధ్యాహ్నం హఠాత్తుగా దూకిన ఈ బృందం ఎనిమిది మంది బంగారు నగల వ్యాపారుల షాపులకు నోటీసులు తీసుకొచ్చిందని, అందులో మూడు అంగళ్లకు చెందినవారు మొహం తప్పించడమో, అంగట్లో దొరకకుండడమో జరిగిందని అక్కడ అనుకుంటున్నారు. ఐదు మంది మాత్రం లద్దులాగా దొరికినట్లున్నారు. ఈ ఇన్‌కంటాక్స్ బృందం నెల్లూరులో బంగారు వెండి నగల షాపులను స్థనశల్య పరీక్ష గావించడమే కాదు, ఆయా అంగళ్లలో దొరికిన

**ఇంత పెద్ద మొత్తం మున్నెన్నడూ పట్టుబడలేదా?**

రికార్డులను బట్టి వారి వారి ఖాతాదారుల కోసం అనేక గ్రామాలకు పోయివున్నారని తెలుస్తున్నది. ఇన్‌కంటాక్స్ బృందం దిగిందనగానే, బంగారు అంగళ్లన్నింటికి మద్రాసు బర్మాబజారు లోని స్మగ్లింగ్ షాపుల వలె రెప్పపాటులో షట్టర్లు మూత పడ్డాయట. ఎక్కడ దొంగలు అక్కడ అన్నట్లు ఎక్కడి వారక్కడ, మరీ మార్వాడీ షాపులవారైతే, అంగళ్లు ఇండ్లతోటి అప్రమత్తమై పోయారంటున్నారు. ఈ దాడిలో కిలోల కొద్దీ బంగారు, టన్నుల కొద్దీ వెండి, లక్షలు విలువ చేసే కరెన్సీ కట్టలు, షేర్ సర్టిఫికెట్లు, ముఖ్యమైన పత్రాలు దొరికినట్లు వదంతులను బట్టి తెలుస్తున్నది. వారి లక్ష్యంలో ఉన్న షాపులు, వారి ఇండ్లు, వారి వారి గుమాస్తాల ఇండ్లుకూడా ఒకేసారి శోధించినట్లు తెలుస్తున్నది.

ఒక షాపు మీద దాడిలో సుమారు 50 కిలోల బంగారు, ఒకటిన్నర టన్నుల వెండి, పది లక్షలు విలువ చేసే ఐదు వందల రూపాయల కరెన్సీ కట్టలు దొరికినట్లు; ఈ అంగడిలో 7 వ తేది రాత్రి 3.30 వరకు సెర్చి జరిగినట్లు, లెక్కలో లేని బంగారు నగలు వగైరాలతో సూట్‌కేసులు నింపుకొని 8 తేది వుదయం పది గంటల ప్రాంతంలో కార్లెక్కినట్లు తెలుస్తున్నది. అంగడి వెనుకనే వున్న

కొరవ 5 పేజీలో

**ఐ.డి.ఐ. వారి ముట్టడి —**
**కిలోల కొద్దీ బంగారు —**
**టన్నుల కొద్దీ వెండి —**
**లక్షల కొద్దీ కరెన్సీ —**
**షేర్ సర్టిఫికేట్లు దొరికాయా ?**

# కోట్లకు గాలంవేసిన నాయుడు!

ముఖ్యమంత్రి శ్రీకోట్ల విజయభాస్కరరెడ్డిని రాపూరు అసెంబ్లీ నియోజక వర్గం నుంచిపోటీ చేయాల్సిందిగా రాపూరు శాసన సభ్యుడు శ్రీ నువ్వుల వెంకటరత్నం నాయుడు ఆహ్వానించారు. ఇటీవల నాయుడు హైదరాబాదులో ముఖ్యమంత్రిని కలిసి రాపూరుకు ఆహ్వానించారట. "మీరు గనక అంగీకరించేట్లయితే ఇప్పుడే రాజీనామా చేస్తాను" అని నాయుడు గారు కాస్తంత ఆవేశంగా అనే సరికి ముఖ్యమంత్రి చిరునవ్వు నవ్వారట.

"నాయుడు గారూ రాపూరు నాకు కొత్తదేమీ కాదు. గతంలో ఏ.సి.మరణానంతరం పరిశీలకుడుగా నెల్లూరుకు వచ్చి ఆనం సంజీవరెడ్డి గారి అభ్యర్థిత్వాన్ని సిఫారసు చేసి, విజ్పోటిగా గెలిచేందుకు అవకాశం కల్పించింది నేనే గదా " అని కోట్లతో అన్నారట. అందుకు నాయుడు పట్టు వదలకుండా " మీరు గనక రాపూరుకు వస్తే ఏకగ్రీవంగా గెలిపించి పంపుతాన్నా"రట. నాయుడు గారి ప్రతిపాదనకు 'కోట్ల' "నో "అన్నప్పటికీ ఆఆహ్వానానికి ముఖ్యమంత్రిగారు నిలువెల్లా పులకించిపోయినట్లు అభిజ్ఞవర్గాల భోగట్టా. ముఖ్యమంత్రి దగ్గర ప్లస్ పాయింట్ సంపాదించుకున్న నాయుడు గారి ద్వారా నెల్లూరు జిల్లాకు ఏదైనా లైటు కారు దక్కుతుందేమో వేచి చూడాల్సిందే.

**హైదరాబాదు విశేషాలు**

## సమైక్య వేదికపై అనైక్య శంఖారావం

ఒక ఒరలో రెండు కత్తులు ఇమడవన్నట్లు ఒకే వేదిక మీద తెలుగు దేశం, కాంగ్రెస్‌పార్టీ నాయకులు కాసింత సేపు కూడా కూర్చోలేరని తేలిపోయింది. సారావ్యతిరేక ఉద్యమానికి ఊపిరి పోసే విధంగా ఈనాడు రామోజీరావు శంఖారావం క్యాసెట్లు తయారు చేయించి వాటి విడుదల సందర్భంగా సమైక్య వేదికను ఏర్పాటు చేసి తెలుగుదేశం, కాంగ్రెస్ నాయకులను పిలిచారు. ఇంకేముంది తెలుగు దేశం అధినేత ఎన్టీఆర్ మందీ మార్బలంతో రాగా, ముఖ్యమంత్రి కోట్లవారు కాంగ్రెస్ నాయకులందర్నీ కట్టకట్టుకుని మరీ వచ్చారు. తీరా ప్రారంభోపన్యాసంలో ఎన్టీఆర్ విజృంభించి తన సహజ ధోరణిలో కాంగ్రెస్ వారిపై వీరంగం చేయడం మొదలెట్టాడు. ఇది సహించని సమాచార శాఖ మంత్రి పసల పెంచలయ్య ఎన్టీఆర్ ఉపన్యాసానికి అభ్యంతరం చెప్పడంతో కాంగ్రెస్ వారంతా పెంచలయ్యకు మద్దతు పలికారు.

కొరవ 5 పేజీలో

## భ్రమలో 'హనుమ'

నగరంలో ఇటీవల జరిగిన సభలో రాజ్యసభ సభ్యుడు వి. హనుమంతరావు తన బద్ధశత్రువు నేదురుమల్లి జనార్దనరెడ్డిని ముఖ్యమంత్రి అంటూ సంబోధించి అందర్నీ ఆశ్చర్యంలో ముంచెత్తాడు. పదవిలో వున్నంత కాలం జనార్దనరెడ్డిని ముఖ్యమంత్రి నుంచి క్రిందకు త్రోయడానికి అహోరాత్రులు శ్రమించిన హనుమంతరావు ఇప్పుడు జనార్దనరెడ్డి ముఖ్యమంత్రిగా వున్నాడన్న "భ్రమలో" వుండటం విచిత్రమే. అయితే అదే సభలో ప్రస్తుత ముఖ్యమంత్రి కోట్ల విజయభాస్కరరెడ్డి గారు కూడా వుండటంతో హనుమంతరావు నాలుక్కరుచుకోవాల్సి వచ్చింది. 'హనుమ' నోట 'జనార్దనస్తోత్రం' ఏమిటబ్బా" అని సభికులంతా ముక్కున వేలేసుకున్నారు.



కలసి వుంటే కలిగే సుఖానికి గుర్తుగానేనా కలిసి తినడం!

(ముఖ్యమంత్రికి మాజీ ముఖ్యమంత్రి విందు దృశ్యం)

# మరపుకురాని వ్యక్తి — కందుల ఓబులరెడ్డి

రాజకీయ వాది అనే వాడు ఏదో ఒక కార్యకలాపంతో, కనీసం పత్రికా ప్రకటనల స్థూనాధారంగా నైనా వెలుగులో వుండక పోతే జనం మరచిపోతారు. అందువల్లనే ఎంతో మంది స్వయ మారోపిత పదవులతో, పత్రికల ద్వారి మందిని సంపాదించి గొప్ప ప్రజాసేవకులుగా, నాయకులుగా చలామణి అవుతుంటారు. అటువంటి రోజుల్లో పుష్కర కాలంగా పేరె వినబడకుండా ఇంటి పట్టునే వుండి పోయిన రైతు పోరాటయోధుడు, కాంగ్రెస్ వాది, ఆచార్య రంగా మెరిక లాంటి తొలి అనుయాయుల్లో మొదటి వారనదగిన కందుల ఓబులరెడ్డి గారు ప్రజల స్మృతి పథంలో ఎలా వుంటారు?

ఆ ఓబులరెడ్డి గారు మొన్న 3 తేది ప్రకాశం జిల్లాలోని స్వగ్రామం లింగాపురంలో దేహయాత్ర చాలించారు.

**పాతజ్ఞాపకాలు క్రొత్త అనుభవాలు**

84 ఏండ్ల జీవితంలో ఓబులరెడ్డి గారు అరవై ఏండ్లయినా రైతాంగ సేవలో, ప్రజాసేవా రంగంలో గడిపి వుంటారు. రాయలసీమలో రంగా గారికి తొలిరోజుల్లో లభించిన యువరత్నాలలో ఓబులరెడ్డి గారొకరు. వేగిరెడ్డి బాలిరెడ్డి, పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి, వల్లభరావు వంటి అంకిత భావం కలిగిన రైతు రక్షణ దళ వీరులలో ముఖ్యులు. వీరిలో ఆఖరుగా మిగిలి వుండిన వారు ఓబులరెడ్డి గారు. ఆయనా పోయారు. కోస్తా జిల్లాలలో అటు శ్రీకాకుళం మొదలు ఇటు నెల్లూరు వరకు రంగా గారి శిష్యులు అసంఖ్యాకులు. వీరిలో పలాసా మొదలు మద్రాసు వరకు పాదయాత్రన రైతు రక్షణ దళాన్ని నడిపిన కొమ్మారెడ్డి సత్యనారాయణ 50 వ వర్ధంతి ఆ మధ్య జరిగింది. ఆయన రంగా గారి అనుయాయుల్లో ఒకరు. కోస్తాలో ఆనాటి యోధుల్లో సర్దార్ గౌతు లచ్చన్న మిగిలి వున్నారు. ఆ తొలితరం రైతోద్యమ నాయకుల్లో ఓబులరెడ్డి, లచ్చన్న గారలు మిగిలి వుండినారు. అందులో ఓబులరెడ్డి దాటుకున్నారు.

సన్నగా, పొడవుగా, ఫుల్ షర్టు – ధోవతి – కొసమడతలో దూర్చిన మెడ చుట్టూ అంగ వస్త్రంతో ఠీవిగా వుండే వారు ఓబులరెడ్డి గారు; మితభాషి; మాట్లాడితే మొహానికేసి కొట్టినట్లుండే నిర్భీతి ఆయన స్వభావం. రాష్ట్ర కాంగ్రెస్ కార్యదర్శిగా వుండగా ప్రకాశం పంతులు వంటి అగ్రనాయకుణ్ణి వుద్దేశించి " వ్యక్తులు ఎంత గొప్ప వారైనా పార్టీకి లోకువే" అని ప్రకటన చేయగలిగిన ధైర్యశీలి ఓబులరెడ్డి. రంగా గారి ముందు పిల్లవాడిలా వినయ విధేయలతో వుండే వాడు కాని సందర్భం వస్తే నిర్మొగమోటంగా అడగడానికి జంకే వాడు కాదు. 1952 లో మద్రాసు ము[illegible]గా రాజాజీ లోక్ పార్టీ ప్రతినిధిగా మంత్రిత్వంలో లచ్చన్నకు మంత్రిత్వాన్ని ఇవ్వగలనని చెప్పినప్పుడు, తిమ్మారెడ్డి గారు అసంతృప్తులైనారు గాని, ఓబులరెడ్డి గారు తొణకలేదు. అంతటి గంభీర హృదయం ఆయనది.

ఆయన రెండు సార్లు ప్రదేశ్ కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి అయ్యారు. చీరాలలో నీలం సంజీవ రెడ్డి గారిని, తెన్నేటి విశ్వనాథం గారిని ఓడించి విజయవాడలో రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడైనపుడు రంగాగారు రెండు సార్లు ఓబులరెడ్డి గారిని ప్రధాన కార్యదర్శిగా తీసుకున్నారు. ఓబులరెడ్డి గారు రంగా గారి హృదయాన్ని అంతగా చూరగొన్నా దన్న మాట; ఆయన విశ్వాసానికి అంతగా పాత్రుడైనాడన్నమాట! కార్యదర్శిగా వున్నప్పుడు ఓబులరెడ్డి గారు నెల్లూరు నాయకుల్లో ఏ.సి. సుబ్బారెడ్డి గారిని తమ వర్గంలో చేర్చుకుంటే జిల్లాలో తమకు బలం చేకూరు తుందని దూరదృష్టితో విశ్వ ప్రయత్నం చేశాడు. కాని ఏ.సి. రాజకీయం ముందు ఓబులరెడ్డి వ్యూహం పనిచేయలేదు; ఆఖరుకు జిల్లా పరిషత్తు ఛైర్మన్ నిర్ణయంలో ఏ.సి. ఓబులరెడ్డినే వుపయోగించ గలిగాడని జ్ఞాపకం.

ఓబులరెడ్డి గారి రెండు సార్లు మంత్రి అయ్యారు. మొదటి సారి 1956 లో కర్నూలులో బెజవాడ గోపాలరెడ్డి గారి ముఖ్యమంత్రిత్వంలో ఆరుమాసాలు; 1978 లో హైదరాబాదులో డాక్టర్ మర్రి

కొంద 10 పేజీలో



## పినాకిని తీరం

### కలెక్టరు ఆదర్శం

నాకు తెలిసి కుమారి సుజాతా రావు, శ్రీ జనత్‌హాస్పెన్‌లు తప్ప ఏ కలెక్టరూ, ఆ మాట కొస్తే ఏ అధికారీ, ఇంకా చెప్పాలంటే ఏ రాజకీయ నాయకుడూ, రాజకీయ వాది చేయని చేయలేని పనిని కలెక్టరు శ్రీ ఎం.సాంబశివరావు చేశారు; ఆదర్శప్రాయుడయ్యారు. అటువంటి వుత్తమ అధికారిని మనసారా అభినందించకుండడం ఎట్లా?

జనవరి 1న ఏటేటికి ప్రాముఖ్యత తగ్గవలసింది పోయి పెరిగి పోవడం చూస్తుంటే ఈ సాంప్రదాయమొక వేలంవెర్రిగా, గొర్రెదాటుగా స్థిరపడిపోయిందా అనిపిస్తున్నది. ఈ సంవత్సరం ఒకటో తేది నెల్లూరు టవున్‌లో ఎంత కోలాహలం, ఎంత సంబరం, ఎంత పరుగులో చూచిన వారికి తెలుస్తుంది గాని, వ్రాస్తే గ్రహింపుకు రాదు. ఎవరో పెద్ద రాజకీయ నాయకుడో, సినిమా స్టారో వచ్చినపుడో, జనరల్ ఎన్నిక పోలింగ్ రోజో తప్ప అటువంటి దృశ్యాన్ని చూడము. జనవరి ఒకటో, తేది పిచ్చి జనంలో అంతగా ముదిరిపోయింది. వ్రాయడానికి జంధ్యాల వంటి కవి, పాడడానికి ఘంటసాల వంటి గాయకుడు లేరుగాని వుండి వుంటే ఆ పుష్పవిలాపాన్ని, ఆ పండ్ల విలవిలలను గూర్చి హృదయాలను ద్రవింప జేసే మధురమైన కవిత జాలు వారి వుండేది. కమ్మనైన కంఠం వినిపించి వుండేది. వేలు కాదు, లక్షల కొలది పూలమాలలు, పండ్లు, కేకులు పొర్లాడాయి; ఆ రోజు పూలమాల కంఠాన ధరించని అధికార, అనధికార ప్రముఖుల కార్లు, జీపులు లేవంటే నమ్మండి! వందలు వేల కొద్దీ వచ్చిన పెద్దలకు వాటినేమి చేద్దామా అని తోచక తికమక పడిపోయినట్లున్నారు. ఒక జిల్లా అధికారి ఇల్లు ముందు రోజు సాయంత్రానికే ఫ్లడ్ లైట్లతో ధగధగ లాడిపోయింది; ఆ ఇల్లున్న వీధి షామియానాలతో చలువ పందిళ్లు వేసుకున్నది. ఒకటో తేది వుదయం ఆ ఇంటి ముందు తిరునాళ్ల జనం! వచ్చిన పూల మాలలు ఏంచేస్తారు? – గేట్లు, కాంపౌండు గోడలను ముస్తాబు చేసుకున్నారు. అదే విధంగా ఎందరి ముంగిళ్లో, గేట్లో పూల దండల మయ మయ్యాయి! రాజకీయ వాదులలో కూ[illegible] తీసిపోలేదని పించుకునే వారు [illegible]లేదు. పూలమాలల భవనాలకు పురిదిసి [illegible]ండిపోయినా మరు జనవరి ఒకటి వరకు వుంచుకునే వాసుందరని చూడకుండా దృఢంగా ఎట్లా చెప్పగలం! ఈ విధంగా ఈ సాంప్రదాయం హద్దులు మీరి పోయింది; అరాజకంగా తయారైంది. ప్రభుత్వం పొదుపు జపం చేస్తుంటుంది; ఇది పెట్రోలియం పదార్థాల పొదుపు వారమని ప్రబోధపు ప్రకటనలతో హోరెత్తిస్తున్నది. ఇటువంటి పరిస్థితుల్లో అధికార వాహనాలు ఆ ఒక్క రోజు ఎంత పెట్రోలు, ఎంత డీజల్ కాల్చి వుంటాయో! అధికార్ల వల్ల సంపాయించిన పాపపు ధనంలో ఎంత మందికి ఎంత కరిగి వుంటుందో చెప్పలేము! ఈ దుబారా దిసమొలతో నృత్యం చేయడం అసహ్యం, జుగుప్సాకరం!

ఈ జనవరి ఒకటి మర్యాద వ్యక్తుల మీద తమ కున్న గౌరవాభిమానాలకు చిహ్నమా? పొందిన సహాయానికి కృతజ్ఞతా సూచనా? అధికార్ల, అనధికార్ల భేషజాన్ని సంతృప్తి పరచడానికి, వారి కనుసన్నల లో వుండ డానికి అనుసరించే సులభమైన మార్గమా? – అన్ని రకాలుగా, బహు ముఖాలుగా వుండవచ్చు.

మొగమాటముండే వారు, పని వుండేవారు మనసులో లేకపోయినా ఫలపుష్పాదులకు ఒకటో తేది వచ్చినట్లు హాజరు కావలసిందే. లేకుంటే గైర్ హాజరు పడుతుంది! కొందరి వద్ద అటెండెన్సు రిజిస్టర్లు వుండవచ్చు. ఆట్సెంటు అయిన వారికి దాని నష్టం వుండనే వుంటుంది. అందువల్లనే అయిష్టంగానైనా సమయానికి తెచ్చుకున్న సంతోష వదనంతో ఈ మొక్కుబడి తీర్చుకోక తప్పడం లేదు. మొన్నొక వుద్యోగి తెల్లవారి ఆరు గంటలకు సైకిల్‌లో బయలుదేరాడట. టవున్‌లో అధికార్ల గడపలన్నీ ఎక్కిదిగి మధ్యాహ్నం ఒంటి గంటకు మిగిలిన ఒక ఆపిల్‌తో వూసురో మంటూ నా దగ్గరకు వచ్చాడు. అతను డయాబెటిక్ రోగి. ఈ విధంగా ఎంత మంది వుంటారో గదా!

సాంబశివరావు గారు 1 తేదికి ముందుగానే క్యాంపు నిర్ణయించుకున్నట్లుంది. ఆ రోజంతా కృష్ణాపట్నం వగైరా ప్రదేశాలలో సాయంకాలం వరకు అధికార కార్యక్రమంలో నిమగ్నులై పండ్ల పూల ప్రహసనం సద్దుమణిగిన తర్వాత బంగళాకు చేరుకున్నారు. ఎంత మందికి ఆశాభంగం కల్గించారో, ఎంత మందిని నిరుత్సాహులను చేశారో, ఎంత మంది ఆశలను వమ్ము చేశారో పాపం! జనవరి 1 భాగోతానికి స్వస్తి పలకడమే కాదు, ఆ రోజు పూర్తిగా అధికార ప్రోగ్రాములలో గడపడం విశేషం. సంవత్సరాది రోజు సోమరితనంగా ఇంట్లో గడిపితే సంవత్సరమంతా అంతేనని, ఆ దినం తీరిక లేకుండా పనిచేస్తే ఏడాదంతా చురుగ్గా వుంటారనే గుడ్డి నమ్మకం వుంది. అంధ విశ్వాసం శ్రీ సాంబశివరావుకు వర్తించదు గాని, జిల్లా అధిపతిగా మార్గదర్శకుడయ్యారు. కాని ఆ మార్గాన్ని అనుసరించే వారు, కనీసం అనుసరించా లనుకునే వారు ఎంత మంది వుంటారు? యువ వున్నతాధికారుల్లో భిన్న మార్గాన్నవలంబించిన సాంబశివరావు గారికి మరో సారి అభినందనలు తెలుపుతున్నాము.

కొంద 10 పేజీలో

జమీన్ రైతు

## ఇంత అసహనమా?

ఈనాడు రామోజీరావు గారు ఎంతో ప్రచారార్భాటంతో నిర్వహించిన ఐక్యవేదిక సభ రసాభాస అయింది. మన రాజకీయ వాదులు, విభేదాలను మరచి ఒక వేదిక పై పావు గంట కూడా గడపలేరని లోకానికి స్పష్టమైంది! సారాయి ఉద్యమానికి ఉత్తేజం కల్పించడానికి, ఊపిరి పోయడానికి రామోజీ రావు తన పలుకుబడి నంతటినీ వుపయోగించి ఏర్పాటు చేసిన వేదిక ఇది.

రాజకీయాలకు సంబంధం లేని వ్యక్తి, రాజకీయాతీతమైన సమస్య పై, రాజకీయ ప్రమేయం లేకుండా నిర్వహించే సభలో ఎన్టీఆర్ రాజకీయాలు మాట్లాడి, రసాభాస సృష్టించడం విచారకరం. ఆయన ధోరణి అందరికీ తెలిసిందే. ఆయన దృష్టిలో ప్రసంగం అంటే కాంగ్రెస్‌ను తిట్టడం. క్లిష్టమైన పదాలతో, సంస్కృత సమాసాలతో, పళ్లు పటపట కొరుకుతూ, ఆవేశం ప్రదర్శిస్తూ కాంగ్రెస్‌ను తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టి ప్రజలను ఆకర్షించడం ఆయన నేర్చిన విద్య. ఆ నీచమైన అలవాటును ఆ వేదిక పై కూడా మానుకో లేక పోవడం ఎన్టీఆర్ తప్పు అయితే, ఆయన సంగతి తెలిసీ అనవసరంగా వివాదం సృష్టించడం కాంగ్రెస్ మంత్రుల తప్పు. వీధుల్లోసాధారణ కార్యకర్తలు తన్నులాడు కున్నట్లు నాయకులు చొక్కాలు చింపుకునే పరిస్థితికి వచ్చి సభనే కాక, తమను తామే అపహాస్యం పాలు చేసుకున్నారు. ఆ వాతావరణంలో కూర్చుని వుండడం సిగ్గుచేటనే భావంతో గవర్నర్ వంటి వారు నిశ్శబ్దంగా నిష్క్రమించే పరిస్థితి కల్పించారు. కృష్ణ కాంత్ తొలి నుంచి సారాయి ఉద్యమ సానుభూతి పరుడు. చాలా సార్లు చాలా స్పష్టంగా ఆయన ఆ విషయం వ్యక్త పరిచారు. అటువంటి మేధావి, సంస్కారి- రోతగా భావించి, ప్రక్కకు తప్పుకునేటట్లు వ్యవహరించినందుకు దేశం, కాంగ్రెస్ నేతలిద్దరూ సిగ్గు పడాలి.

అసలు రాజకీయ వాదులలో ఒకరి పట్ల ఒకరికి ఇంత అసహన భావాలెందుకు పెరుగుతున్నాయి? ఒకర్నొకరు శత్రుభావంతో, పగవారి వలె చూసుకునే స్థితి ఎందుకు ఏర్పడుతున్నది? విధానాలు, పార్టీలు వేరు అయినంత మాత్రాన వ్యక్తులూ శత్రువులౌతారా? రాను రాను రాజకీయం అంటే పదవులనే భావం ప్రబలి, పదవిలో వున్న వాడి పట్ల ఈర్ష్య, ద్వేషం, అసూయలు పెరగడమే ఈ అసహన వైఖరికి కారణమా? రాజకీయాలలో సౌహార్ద్రత, రాజకీయ వాదులలో సౌశీలత్వం లోపించడమే ఈ నీచ ప్రవృత్తికి ప్రేరణా?

ఏది ఏమైనా రెండు పార్టీల నాయకులు చేసిందీ తప్పే! సారాయి ఉద్యమం వంటి సామాజిక కార్యక్రమాలు ఇటువంటి రాజకీయ వాదుల దయాదాక్షిణ్యాల పై ఆధార పడడం మనం చేసుకున్న దురదృష్టం. అందువల్లే ఈ ఉద్యమం పెడదారి పట్టి పోతున్నది. ప్రశాంతంగా, సావధానంగా, లోతు పాతులు చర్చించి, సమస్యకు పరిష్కారం కనుగొనే ప్రయత్నం పోయి, విమర్శలు, తిట్లు, శాపనార్థాలు, ఆరోపణలతో భ్రష్టు పట్టి పోతున్నది.

## ఆర్టీసి అఘాయిత్యం!

రాత్రికి రాత్రి ఆర్‌టిసి బస్ ఛార్జీలు పెరిగిపోయాయి. ప్రయాణీకుల పై పెనుభారం పడింది. రాష్ట్ర బడ్జెట్‌లో కూడా ఏకమొత్తంగా రెండు వందల కోట్ల పన్నుల భారం పడదు. అటువంటిది ఒక్క బస్ ప్రయాణీకుల పైనే రెండు వందల యాభై కోట్లు అదనంగా చెల్లించాల్సిన వారిలో బాధ్యత పెట్టారు.

ఆయిలు, టైర్ల ధరలు పెరిగినమాట నిజమే; జీతనాతాల ఖర్చు హెచ్చిన మాట నిజమే; ఆర్టీసి నష్టాల పాలౌతున్న సంగతీ నిజమే. అయితే ఆ సాకుతో ప్రజలపై ఒక్కసారిగా ఇంత బరువు మోపాలా? ఇరుగు పొరుగు రాష్ట్రాల సంగతి చెప్పి మభ్య పెట్ట జూస్తున్నది ఆర్‌టిసి. అందుకోసం పత్రికలలో పెద్ద పెద్ద ప్రకటన లిస్తున్నది. అందులోనూ మోసమే. దేశంలో అత్యధిక ఛార్జీలు దండే రాష్ట్రాలను ఎంపిక చేసి ఆ పేర్లే ఇస్తున్నారు. ప్రక్కనే వున్న తమిళనాడు, కేరళలను వదలి ఎక్కడో వుండే హిమాచల్ ప్రదేశ్ రేట్లు ప్రకటించడం పక్కా మోసం కాదా?

ఆర్టీసి నష్టానికి కేవలం పెట్రోలు, విడి భాగాల ధరల పెంపు కారణమనడం అసత్యం. నిర్వహణాలోపం, విచక్షణ లేని రాయితీలే అసలు నేరస్తులు. వాటిని చక్కదిద్దుకుంటే సంస్థ బాగుంటుంది. ఆర్‌టిసి కంటే ఎంతో తక్కువ ఛార్జీలతో బస్‌లు నడిపే ప్రైవేటు ఆపరేటర్లు లక్షలార్జిస్తున్నప్పుడు, ఆర్‌టిసి కి మాత్రం ఎందుకు నష్టం వస్తుంది? ఎన్టీఆర్ హయంలో లాభాలలో వుండిన సంస్థ ఇపుడు నష్టాల పాలెందుకైంది?

అసలు ప్రజలను ఇంత పీడించి, వేధించి ప్రభుత్వ నిర్వహణలో రవాణా రంగాన్ని భ్రష్టుపట్టించేకంటే, బస్‌లను ప్రైవేట్ పరం చేయకూడదా? బాధ్యత వుంటుంది; పోటీ వుంటుంది; సేవాభావం లేకపోయినా, వ్యాపారం కోసమైనా ప్రయాణీకుల అవసరాలు గమనిస్తారు. ఆర్‌టిసితో సమస్యలు తప్ప, ప్రజలకు లభిస్తున్న సేవ ఏమి వుంది? కార్మికులకు తగిన రీతిలో పునరావాసం కల్పించి, ఆర్‌టిసిని విజాతీయం చేయడం మేలు.

---

## జమీన్ రైతు

8 - 1 - 1943

8 పేజీలు 0 - 1 - 6

### 50 ఏళ్ళ క్రితం ఈ వారం

### నెల్లూరు ముచ్చట్లు

టవున్‌లో ఆయుర్వేద ఆసుపత్రిని ముత్తరాజా శ్రీనివాసరావుకు కత్తిపోటు లభించిన ప్రదేశాన్నుండి, ట్రంకురోడ్డును శోభావంతం చేసిన చెతుర్వేదుల భవన ప్రాంతానికి మారిస్తే ప్రజలకు సౌఖ్యంగా వుంటుందని శ్యామయ్యంగార్ స్వర్గసీమలోని 'కర్నాటక వైద్యశాల' నుండి కబురంపుతున్నారు. కమీషనరు గారి మొగమోటం ఏమంటుందో?

వేద సంస్కృత కళాశాలలో తిరుపతి తర్కశిరోమణి, పుదాలి సుబ్బరామయ్య గారిని (ఏర్పేడు ఆశ్రమంలో రూ. 24/-లు జీతంతో ఉన్నవారిని) రూ. 20 ల జీతంతో ఏర్పరచారట. తర్క పాఠాలకు తార్కికుణ్ణి నియమించడం బాగానే వుంది.

వ్యాకరణ పండితులు హనుమచ్ఛాస్త్రి గారు ధ్వన్యాలోకం యిత్యాది సాహిత్య పాఠం చెప్పంగా, సాహిత్య విద్యా ప్రవీణ - వ్యాకరణ విద్యా ప్రవీణ - డిగ్రీలు పొందిన మేము ముక్తావళి యిత్యాది తర్కపాఠం చెప్పలేమా అని యిక్కడ చదువుకున్న విద్యార్థులంటారు. నిజమే గాని సాహిత్య పాఠం కూడా సాహిత్య ప్రవీణుల చేతనే చెప్పించమనడం సబబుగాని దీన్ని ఆక్షేపించడం మాత్రం సబబుగాదంటాను.

### కేసులు

బస్ కండక్టరు దండి యతిరాజులు నిషిద్ధకర పత్రాలు కలిగి యున్నాడని పెట్టిన కేసు 31 తేదిన తోసి వేస్తూ - పోలీసు కేసు ధైరి అబద్ధమని, ఖాదర్ మొహిద్దీన్ తెచ్చుకోలు సాక్షిగాని, చూచిన వాడు కాదనీ గూడా రెండు వర్ధించాడు మెజిస్ట్రేటు - వకీలు అక్కిరాజా గెలిచాడా? పార్టీ యతి రాజులు గెలిచాడా?

వి. గోవిందరాజులు అనే విద్యార్థి నిషిద్ధ వాఙ్మయం కలిగి వున్నాడని కేసు పెట్టబడి జరుగుతున్నది. ఇతనికి కాలేజి అటెండెన్స్ చాలదని బెయిలు మీద విడుదలైనాడు.

### నెల్లూరు పత్రికల హర్తాళ్

పత్రికాధిపతులంతా 5 వ తేదీ చేరి 6 వ తేదీ హర్తాళ్ జరుపవలసిందిగా తీర్మానించిరి. (సివిల్ లిబర్టీస్ వారు మాత్రం తీర్మానముతో ఏకీభవించలేదు) ఆ ప్రకారం సివిల్ లిబర్టీస్ తప్ప తక్కిన వారు హర్తాళ్ జరిపిరి. 6 వ తేది సాయంత్రం తిరుగా సమావేశమై పత్రికా సంపాదకుల సంఘాన్ని స్థాపించిరి. అధ్యక్షులు పి. సుబ్బరామయ్య గారు, కార్యదర్శి యం.యస్. మూర్తిగారు. ఈ సభలో బొంబాయిలోని స్థాయి సంఘ తీర్మానాన్ని బలపరుస్తూ, మద్రాసు ప్రభుత్వం పత్రికల పట్ల జరిపిన చర్యను నిరసిస్తూ తీర్మానించిరి.

### పత్రికలు – ప్రభుత్వ ప్రతీకారము

అనుకొన్న ఒడంబడికకు భిన్నంగా కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు నడచినందుకు అసమ్మతి సూచకంగా ప్రభుత్వ ప్రకటనలు – బిరుదులు ప్రకటించరాదని పత్రికా సంఘం వారు నిర్ణయించుకొని నూతన సంవత్సర బిరుదములు ప్రకటింపరైరి. బిరుదముల చేతనే చాలా మందిని తమ దాసులను చేసుకొను ప్రభుత్వమునకు – బిరుద వ్యామోహితులకు ఇది పెద్ద సుత్తె పెట్టు. దీనికిగా ఇతర రాష్ట్రములకు ముందే మదరాసు ప్రభుత్వం 'మా వార్తల మీ కివ్వము' అని బెదరించుట హాస్యాస్పదముగా వున్నది. జిల్లా అధికారులలో కలెక్టరు చెటూరు దీనిని తన మండలం గూడ ప్రవేశ పెట్టి కొండి రామమూర్తి గారికి తగిన శిక్షించిని పించినారు. యితర విషయాలలో యింత త్వరచూపక పోయినా, ఈ విషయంలో ఇతర రాష్ట్రాలకు మార్గదర్శకమై నందుకు మన రాష్ట్ర పాలకులు ప్రశంసాపాత్రులు. ప్రభుత్వ శాఖ ప్రకటనల కంటే ప్రజాపత్రికల వ్రాతలు ప్రజలలో ఎక్కువ విశ్వాసమును కలిగించుట నిర్వివాదాంశము. పత్రికా సంఘ నిర్ణయానికి భిన్నంగా మద్రాసు మెయిల్ పత్రిక నడుచుకొనుట విచారకరము.

### దేశిరెడ్డి శేషురెడ్డి గారి అస్తమయం

కాంగ్రెసు సేవలో, జమీన్‌రైతు సేవలో, ఒకనాడు అఖండ ప్రజ్ఞ భక్త్యావేశాలతో దీప్తవంతంగా మెరిసిన మిత్రులు దేశిరెడ్డి శేషురెడ్డి గారు కొంత కాలముగా క్షయ, మధుమేహాలతో బాధపడుచూ 7.1.43 తేది పగలు 3 గంటలకు గూడూరులో పరమపదించిరని తెలుపుటకు చింతించు చున్నాము.

కొరవ 10 పేజీలో

---

# తిరుపతి లడ్లకు బూతుల దుర్వాసన!

## జనవాణి

డిసెంబర్ 29 తేది నా మిత్రుడితో కలసి వెంకటేశ్వర స్వామి దర్శనార్థం తిరుమల వెళ్లాను. 25 రూపాయల టిక్కెట్టు తీసుకొని ఇద్దరం క్యూలో నిలబడ్డాము. ఆ క్యూలో అయ్యప్ప మాల దీక్షాధారులైన పెక్కుమంది స్వాములు వుండినారు. వారు వేషానికి స్వాములేగాని ఆచరణలో ఏ మాత్రం కాదు. పరమపవిత్ర సన్నిధిలో వారు మాట్లాడుతున్న జుగుప్సాకర భాష వినలేని చెవులు మూసుకొంటే పలువురు మహిళలు అసహ్యించుకోవడం కంటబడింది. ఈ కుహనా భక్తుల వికారచేష్టల మూలంగా అయ్యప్ప భక్తుల పై గౌరవం తగ్గే ప్రమాదం వుంది. క్యూ నుండి లడ్లు అమ్మే కౌంటర్ దగ్గర చేరి మరో సారి ఆశ్చర్యపోవడం నా వంతయ్యింది. దేవస్థాన వుద్యోగులు తమిళం, తెలుగు భాషలు కలిపి సృష్టించిన బూతు పదాలతో అర్థం కాని తిట్లతో ప్రసాదం కోసం వచ్చిన భక్తులను తిడుతున్నారు. ఆ నికృష్టపు నోళ్ల నుండి వెలువడే బూతుల దుర్వాసనతో నిండిన లడ్లను ప్రసాదంగా కొని తినేకంటే ఊరకుండడం మంచిదని భావించి విన్న ఛండాలపు మాటల నిష్కృతిగా భగవత్ నామ స్మరణ చేస్తూ స్వగ్రామం చేరడం నా వంతయ్యింది.

– జె.వి.సుబ్బరాయుడు

కావలి

### ముస్లిం సోదరులకు వినతి

అయోధ్య సంఘటనల విషయంలో ముస్లింలు ఆందోళన చేయతం తగదు. పడగొట్ట బడిన బాబ్రీ మసీదు గోపురాలు ఒకప్పుడు దేవాలయాన్ని ధ్వంసం చేసి కట్టినవే గాని వేరు కాదు. ఈ సమస్య రాజకీయ నాయకుల వల్ల వివాదాస్పదంగా మారక పోయి వుంటే స్థానికులే పరిష్కరించు కొని వుండే వారు. ఇప్పుడు ఈ సమస్య నానా రకాలుగా రూపాంతరం చెంది నమాజ్ చదివే వరకు వచ్చింది. కాని సామూహికంగా అక్కడ నమాజ్ చేయడాన్ని ఇస్లాం అనుమతించదు. కాబా మసీదు, మదీనా మసీదు, జెరుశలేం మసీదు మినహా మరెక్కడా సామూహిక ప్రార్థనలు ఇస్లాంకు వ్యతిరేకం. రాజకీయ నాయకుల మాటల గారడిలో ముస్లిం సోదరులు కొట్టుక పోకుండా వాస్తవ, అవాస్తవాలను గమనించి ప్రవర్తించడం మంచిది.

– గుసుపాటి వేణుగోపాల్

నెల్లూరు

### జిల్లాలోని ఆలయాల గూర్చి ప్రచారం జరగాలి

నెల్లూరు జిల్లాలో అపురూపమైన శిల్పకళా సంపద కల్గిన దేవాలయాలెన్నోగలవు. ఎందరో మహానుభావులు వీటి నిర్వహణకు కొద్దో గొప్పో ఏర్పాట్లు చేయబట్టి ధూప దీప, నైవేద్యాలకు లోటు లేకుండా జరిగి పోతున్నాయి. జిల్లాలో జొన్నవాడ కామాక్షమ్మ, నెల్లూరు రంగనాయకుల స్వామి, పెంచల కోన నరసింహ స్వామి, బిట్రగుంట వెంకటేశ్వర స్వామి, రామతీర్థంలో రామలింగేశ్వర స్వామి, తుమ్మగుంట అయ్యప్పస్వామి, గొలగమూడి వెంకయ్య స్వామి, సూళ్లూరుపేట చెంగాళమ్మ దేవాలయాలు ప్రసిద్ధి చెందినవి. ఈ దేవాలయాలలో కొన్నింటికి మాత్రమే ఇటీవల ఆ దేవాలయ పాలక వర్గాలు శ్రద్ధతో చేస్తున్న ప్రచారం వల్ల భక్తులతో కిటకిటలాడి పోతున్నాయి. మరి కొన్ని వెలవెల పోతున్నాయి. ఈ పరిస్థితి చక్కదిద్దను భక్తులు, పాలకవర్గాలు ఆయా ఆలయాల గూర్చి, విశేష ప్రచారం చేయవలసిన అవసరం ఎంతైనా వుంది.

– బి. పట్టాభిరామయ్య

నెల్లూరు

### సారాతో పాటు వీటినీ నిషేధించాలి

సారా వ్యతిరేక వుద్యమం వల్ల సారా వుంచాలా, నిషేధించాలా అన్న చర్చ ఇటీవల తీవ్రమై వుంది. ఈ నేపథ్యంలో ఒక్క సారాను మాత్రమే నిషేధిస్తే సరిపోతుందా అనే ప్రశ్న ఉత్పన్న మవుతుంది. దీనితో పాటు ధూమపానాన్ని, జూదాన్ని, త్రైలీ లాటరీలను కూడా నిషేధించాలి. అపుడు గాని సమాజంలో తీవ్రమై పోయి వున్న అవినీతి, లంచగొండితనం, అత్యాచారాలకు బ్రేకు పడదని నా

కొరవ 6 పేజీలో



గుజరాత్‌లోని నర్మదా నది పై నిర్మితమౌతున్న సర్దార్ సరోవర్ ప్రధాన కాలువను రికార్డు టైంలో నిర్మించిన నెల్లూరీయుడు జె.ఎస్. రెడ్డిని అభినందిస్తున్న ఆ రాష్ట్ర ముఖ్యమంత్రి చిమన్ భాయ్ పటేల్, స్థానికాధికారులు

## సణుగుడు

* దౌర్జన్యమే బిజెపి మతమా?

* నెల్లూరీయుడికి గుజరాత్‌లో అభినందన

నెల్లూరులో డైలీ లాటరీ అంగళ్ల మీద దాడిచేసి, టిక్కెట్లు చించి పారేశారట బిజెపివారు. అయోధ్యలో మసీదు కూలగొట్టిన తర్వాత ఏ పనైనా తాము దౌర్జన్యంతో చేసేయగలమనే దురభిప్రాయం ఆ పార్టీ కార్యకర్తలలో ప్రబలినట్లుంది.

డైలీ లాటరీలను నిర్దయగా, నిర్దాక్షిణ్యంగా తరిమి పారేయాల్సిందే; అందులో సందేహానికి తావులేదు. లాటరీల వల్ల ఎన్ని వందల మధ్యతరగతి కుటుంబాలు, పేద ప్రజల సంసారాలు బుగ్గిపాలౌతున్నాయో గమనించ గలిగితే ఎవరికైనా కడుపు రగిలిపోతుంది. పత్రికల్లో ఎన్నిసార్లు, ఎంతెంత ఘాటుగా వ్రాసినా, పోలీసులు ఎంత ప్రయత్నం చేసినా ఆ మహమ్మారి బారి నుంచి ప్రజలను కాపాడలేక పోతున్నారు. చిన్న చిన్న వ్యాపారాలు చేసుకునేవారు, ఆటోలు, ట్యాక్సీల డ్రైవర్లు, రిక్షావాళ్లు, చిరుద్యోగులు, రైతులు, మధ్య తరగతి గృహిణులు, ఆఖరుకు ముఠా కూలీలతో సహా ఎన్నో వర్గాల ప్రజలు, వేల సంఖ్యలో మధ్యాహ్నమయ్యేసరికి దీపపు ఆకర్షణకు పురుగుల్లాగా సంపాద సంతటినీ ధారపోస్తున్నారు. కాటన్ మార్కెట్ కంటే ఘోరంగా, డైమండ్ డబ్బాలకంటే దగాగా డైలీ లాటరీలు వీరిని పీల్చి పిప్పి చేస్తున్నాయి. మూలుగులతో సహా నాశనం చేస్తున్నాయి. ఇప్పటికి ఎంతమంది నిర్భాగ్యులు దురాశతో లాటరీ జూదమాడి సర్వంకోల్పోయి ఆత్మహత్యలు చేసుకున్నారో చెప్పలేము. ఎన్ని కుటుంబాలు మానసిక వ్యధతో కుమిలిపోతున్నాయో, ఎన్ని సంసారాలు ఆకలితో అలమటిస్తున్నాయో వూహించలేము. రోజుకి కనీసం 50లక్షల రూపాయల పాపపు సొమ్మును ఆరగిస్తున్నారు లాటరీ వ్యాపారులు. ప్రజలింత దారుణంగా వంచింపబడుతున్నా ప్రభుత్వం నిమ్మకు నీరెత్తినట్లుంది. ఎన్ని ఆందోళనలూ ఆ దున్నపోతు పై వాన పడ్డట్లే వున్నాయి. లాటరీలు నిషేధించడానికి ఆలోచన కూడా చేస్తున్నట్లు కన్పడటం లేదు. సారాయి ప్రొహిబిషన్ సరే- ఆదాయం, రెంగసారా వంటి చిక్కులున్నాయి కాబట్టి, ఆలోచనకు వ్యవధి కావాలి. లాటరీలు ఎత్తిపారేయడానికి ఆలోచన దేనికి? దీనర్థం -ప్రజల బాగోగులపై ప్రభుత్వాలకు చిత్తశుద్ధి శూన్యమని కదా? హైకోర్టు స్టే అనేది సాకు మాత్రమే. కోర్టులు అడ్డం పెడుతున్నాయని ప్రభుత్వం తాను తలపెట్టిన పనులు ఆపుతున్నదా? హైకోర్టు స్టేని వెకేట్

### దేవేంద్ర

చేయించడం పెద్ద కష్టమా! ముఖ్యమంత్రి గారికి ఏదీ పట్టదు; హోంమంత్రి వుంటే కడపలో తన అనుచరులను పోలీసు స్టేషన్ల నుంచి విడిపించుకోవడానికే సమయం సరిపోతున్నది. పోలీసు అధికారులకు మామూళ్లు దండుకోవడం తప్ప మరేదీ తెలియదు. ఐఎఎస్‌లు చదివి, లక్షలకు లక్షలు జీతాలు దిగమింగుతున్న సెక్రటరీలకు తమలో ఏ వర్గానికి, ఏ కులానికి లాభసాటి శాఖలో పోస్టింగ్‌లు లభిస్తున్నాయన్న విచారణతోనే కాలం తీరిపోతున్నది. అమాయక ప్రజలు మాత్రం ఈ దుర్వ్యసనంతో, మాయా జూదంతో మలమల మాడిపోతున్నారు; సర్వనాశనాన్ని కొని తెచ్చుకుంటున్నారు.

ఈ పరిస్థితులలో ప్రజలే ఉద్యమించి ఈ మహమ్మారిని తరిమి కొట్టడం తప్ప వేరే శరణ్యం లేదు. అయితే అందుకు రౌడీయిజం, దౌర్జన్యాలే

కారవ 6 పేజీలో

పేలవంగా వున్న ఆర్టీసి పికెటింగ్‌లు

# తెలుగుదేశం ఇంత నీరసపడి పోయిందేమిటి?

ఆర్టీసి డిపో ముందు ధర్నా ఆర్టీసి ఛార్జీల పెంపుదలకు నిరసనగా తెలుగుదేశం, బిజెపి పార్టీలు నెల్లూరు ఆర్టీసి డిపోముందు సోమవారం వేరువేరుగా ధర్నా కార్యక్రమం చేపట్టాయి. మంగళ, బుధవారాల్లో కూడా తెలుగుదేశం పార్టీ ఈ కార్యక్రమాన్ని కొనసాగించింది. సోమవారం వుదయం ధర్నా చేస్తున్న బిజెపి కార్యకర్తలపై ఒక డ్రైవర్ బస్సు నడపను ప్రయత్నించినపుడు ఆ పార్టీ కార్యకర్తలు బస్సు గాలి తీయడంతో ఉద్రిక్త వాతావరణం ఏర్పడగా అక్కడేవున్న డిఎస్‌పి పి లక్ష్మిరెడ్డి జోక్యం చేసుకొని సర్దుబాటు చేశారు. 12 గంటల వరకూ ఈ కార్యక్రమం కొనసాగింది. బిజెపి ధర్నాకు పార్టీ జిల్లా అధ్యక్షుడు డాక్టర్ సిహెచ్ వరదయ్య, పట్టణ అధ్యక్షుడు ఆచార్య ఆదిత్య నాయకత్వం వహించారు. మంగళ వారం వుదయం బస్సురోకో చేస్తున్న తెలుగుదేశం నాయకులతోపాటు 60మంది కార్యకర్తలను పోలీసులు అరెస్ట్ చేసి తరువాత విడుదల చేశారు. పార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి, మాజీ మునిసిపల్ చైర్మన్ బి.రమేష్‌రెడ్డి, పెళ్లకూరు ప్రభాకరరెడ్డి, డాక్టర్ నాగభూషణమ్మ అరెస్ట్ అయినవారిలో వున్నారు.

పేరుకు పికెటింగ్‌లు జరపడమే కాని, బస్టాండు కేసి చూస్తే అది తెలుగుదేశం కార్యక్రమమని నమ్మబుద్ధి కావడం లేదు. పట్టుమని పాతికమందైనా కన్పిస్తే కదా? అగ్రనాయకులు ఆదేశించారని తూతు మంత్రంగా ధర్నా చేయడం తప్ప ఎవరిలోనూ ఉత్సాహం వున్నట్లు లేదు. తొలిరోజు అరవై మంది అరెస్టయ్యారు; రెండవ రోజు ఆ సంఖ్యా

### సింహపురి

పగానికి తగ్గింది. ఆ తర్వాత మరీ నీరసపడింది. ఏడేళ్లు అధికారం నెరపిన ఒక ప్రధాన రాజకీయ పార్టీ, అత్యంత ప్రతిష్టాకరంగా భావించే కార్యక్రమానికి కార్యకర్తలను సేకరించ లేక పోవడం విస్మయం కల్గించే విషయం. తెలుగుదేశంలో ఇంత నీరసమెందుకు ఏర్పడినట్లు? జిల్లా అధ్యక్షుడుగా ఎంపికైన తర్వాత జరిగే తొలి కార్యక్రమం ఇంత పేలవం కావడం చంద్రమోహన రెడ్డికి అవమానం క్రిందే లెక్క!

#### డాక్టరేట్

సాహిత్య పీఠం పరిశోధకుడు, నెల్లూరీయుడు, యువకవి శ్రీ డివి శ్రవణ్‌కుమార్‌కు తెలుగు విశ్వవిద్యాలయం పిహెచ్‌డి పట్టా ప్రదానం చేసింది. 'తాళ్లపాక కవుల లఘుకృతులు-సవిమర్శక పరిశీలన' అనే అంశంపై పరిశోధనకు గాను పిహెచ్‌డి పట్టా లభించింది. అన్నమాచార్య అధ్యయన సంస్థ సంచాలకులు ఆచార్య సి. రమణయ్య పర్యవేక్షణ పరిశోధన కొనసాగిందట. తెలుగు విశ్వవిద్యాలయం ప్రదానం చేసిన పూర్తికాలిక పిహెచ్‌డి పరిశోధనల్లో ఇది రెండవది కావడం విశేషం.

#### కార్యాలయం ప్రారంభం

గ్రామాలనుండి జిల్లాకేంద్రానికి వచ్చే వైశ్య సంతతి ప్రజల అవసరాలు తీర్చను టౌన్‌లోని ట్రంకురోడ్డులోగల బందు ఫార్మసీ మిద్దెపైన జిల్లా ఆర్యవైశ్య

కారవ 6 పేజీలో



నాగభైరవ కవిత్వంలోని నాజూకు కులుకుల కోసమైనా చదవాలి

# 'పతాక శీర్షిక'

తెలుగు కవన వనంలో ఇపుడు గుభాళిస్తున్న పరిమళం 'అనుభూతి కవిత్వం'. ఆ పరిమళాన్ని పేజీ పేజీ లోకి నింపుకున్న, నింపుకున్న కావ్యం 'పతాక శీర్షిక'. ఇందులో అరవై ఆరు కవితలున్నాయి. అవన్నీ ఇది వరకు వార పత్రికల ద్వారా మనల్ని పలకరించి పరామర్శించినవే! వాస్తవానికి అవి అరవై నాలుగు కవితలే అయినా నాగభైరవ రచనలు, నాగభైరవ పరిచయం అనే శీర్షికల్ని కూడా కవితల కిందే చేర్చడంతో ఓ చమత్కారం చోటు చేసుకొంది. అరవై ఆరు అంకెను తిరగేస్తే అరవై రెండవుతుంది. నాగభైరవకి ఇది అరవై రెండో వసంతం! తన అరవై రెండో ఏట అరవై ఆరేళ్ళ యువ కవులతో పోటీ పడి వ్రాసి కాలంతో కదిలి వచ్చిన కవిగా నాగభైరవ ఈ కావ్యాన్ని మనకు కానుకిచ్చారు.

'పతాకశీర్షిక' లో మూడు రకాల కవితలు కనిపిస్తాయి. 'ఆవేశం అక్షరమైన వేళ' ఏ కవితలో కవి తన కవిత్వాశయాల్ని యిలా చెప్పుకొన్నారు.

> 'కలం కొన్ని అక్షరాలని
> అందంగా ప్రసవిస్తుంది
> మరి కొన్ని అక్షరాలు
> కసిగా రాలి కరవాలాలుగా తేలి
> గాలికి కర్తవ్యాన్ని నూరిపోస్తాయి
>
> ఇంకా కొన్ని అక్షరాలు
> పైకి పోయి మేఘాలై
> ప్రబోధవర్షాలు కురుస్తాయి.

> **గ్రంథ సమీక్ష**
>
> పతాక శీర్షిక
>
> రచయిత
>
> నాగభైరవ
>
> కోటేశ్వరరావు
>
> సమీక్షకుడు
>
> తిరుమూరు
>
> సుధాకరరెడ్డి
>
> ప్రతులకు
>
> నాగభైరవ ప్రచురణలు
>
> గుళ్లపల్లి-523 271.

పై కవితను బట్టి భావ కవిత్వం లేదా అనుభూతి వాద కవిత్వం చెప్పడంతో పాటు కాస్తో కూస్తో అభ్యుదయ ప్రబోధం చేయడం కూడా నాగభైరవ ఆశయం అనిపిస్తుంది. కాని భావ కవితల్లో కానవచ్చే ఆర్ద్రత ప్రబోధ కవితల్లో లేనట్లు, అవి కేవలం నినాదప్రాయంగా మిగిలిపోయినట్లు పాఠకులు ఫీలవుతారు.

ఈ ప్రబోధ కవితల్లో కనిపించే సాంప్రదాయికత 'మొనాటనీ' మిగతా కవితల్లో మచ్చుకైనా లేక పోవడం ఈ

కారవ 10 పేజీలో

# నెల్లూరు నలుచెరుగుల్లో
## విమర్శకుడు

### పోలీసు కింత పొగరెందుకు?

నెల్లూరు పోలీసుల పొగరుబోతు తనానికి దృష్టాంతంగా వుంది సంఘటన. మూలపేట, రామయ్య బడి ప్రక్కన కాలువ కట్టపై 60 కుటుంబాల వారు 30 ఏళ్ల నుంచి కాపురాలుంటున్నారు. అది పిరమ్బోకు స్థలం. ఎమ్మెల్యే జెకె రెడ్డి పిరమ్బోకు వారిని, కలెక్టరును ఒప్పించి వారికి పట్టాలు మంజూరు చేయించారు. మొన్న 6 తేది పట్టాల పంపకం జరగాలి. 5 తేది సాయంత్రం స్థానికులు దశాబ్దాల తర్వాత స్థలాలు తమ స్వంతం అవుతున్నాయని సంబరంతో, స్టేజి కట్టి, విద్యుదీపాలంకరణ చేసి, షామియానాలు వేసి పట్టాల పంపిణీని ఘనంగా జరుపుకోబోయారు. ఈలోగా పోలీసులు వచ్చి మొత్తం పీకేశారట. లైట్లను ధ్వంసం చేశారట. స్టేజిని చిందర వందర చేశారట. రిజర్వు డిఎస్‌పి గోవింద రాజు, ఇద్దరు సర్కిలిన్స్పెక్టర్లు, 50 మంది కానిస్టేబిళ్లు ఈ కిష్కింధా కాండలో పాల్గొన్నారు. ఈ సంగతి తెలిసి జెకె అభ్యంతరం చెప్తే – అది మా పోలీసు కాలనీ స్థలం కాబట్టి పట్టాలు పంచడానికి లేదని దబాయించారట. ఇద్దరి మధ్య వాగ్వివాదం జరిగింది. ఎప్పుడూ కోపం రాని జెకె కూడా పోలీసుకు తీవ్ర హెచ్చరిక చేశారు. ఈలోగా జాయింట్ కలెక్టర్ వచ్చి, అది మీ స్థలమని ఎట్లా చెప్తారని అడిగితే, తెల్ల ముఖం వేశారట. చివరకు అదే స్థలంలో జెకె పట్టాలు పంచారు.

ఏమిటీ భయం లేని తనం? ఆ స్థలం పట్ల వారికి కోరిక వుంటే కలెక్టరుకు విన్నవించి వుండవచ్చు; అడిగి వుండవచ్చు. కట్టిన స్టేజిని కూలగొట్టే అధికారం వీరికెవరిచ్చారు? చట్టం తమ చేతిలో వుందన్న భ్రమలో వున్నారా నెల్లూరు పోలీసులు? ఒక వైపు న్యాయమూర్తి పై జులుం సంఘటన ఇంకా ఆందోళన రూపంలో వున్నప్పుడే వీరిట్లా బరితెగించి ప్రవర్తిస్తున్నారంటే ఏమనుకోవాలి! పోలీసుల పొగరు అణగకుంటే ప్రమాదం!

### కోర్టుల ప్రతిష్టంభన

మెజిస్ట్రేట్ శ్రీఇంతియాజ్ అహమ్మద్ పై కానిస్టేబిల్ జులుం, పోలీసు కేసు నమోదు సంఘటన ఇంకా రగుల్కొంటూనే వుంది. ఇరు పక్షాలూ పట్టుదలగా వున్నాయి. సామరస్య చర్చలకు పిలిస్తే, ఎస్‌పి గారు వచ్చి, న్యాయమూర్తి తమ కానిస్టేబిల్‌కు క్షమాపణ చెప్పాలని అడిగారట. ఆ ధోరణి చూసి రాజీకి వచ్చిన వారు తెల్లబోయారు. న్యాయవాదులు ఇంకా కోర్టులను బహిష్కరిస్తూనే వున్నారు. సంక్రాంతి సెలవులు కాబట్టి సందడి లేదు. పోలీసులు న్యాయమూర్తికి వ్యతిరేకంగా సాక్ష్యాలు సేకరించను ఆ వీధిలోని ఇరుగు పొరుగు వారిని బెదరించ బోయారు. జనం గుమికూడి తిరుక్కునే సరికి తోక ముడిచారు. ఈ సమస్య రాష్ట్ర వ్యాప్తంగా న్యాయవాదుల ఆందోళనకు దారీ తీసేట్లుంది!

### చంద్రయ్యకు గుండె పోటు

కె ఎ ఆర్ చంద్రయ్య (కలవకూరు చంద్రశేఖర రెడ్డి) గుండె పోటుతో నెల్లూరు అపోల్ ఆస్పత్రిలో చికిత్స పొందుతున్నారు. 1 తేది తిరుమలలో వుండగా నొప్పి ప్రారంభమైందట – గమనించుకోక అట్లే నెల్లూరు వచ్చేసరికి విషమించింది. ఇప్పుడు కోలుకుంటున్నారు. చిన్న వయస్సు లోనే పెద్ద ఇబ్బంది కల్గింది పాపం !

### కోర్టుల తరలింపు

జనార్ధన రెడ్డి హయాంలో మంజూరైన కొత్త భవనాల నిర్మాణం కోసం, ఇప్పుడున్న ప్రాంగణం నుంచి తాత్కాలికంగా కోర్టులను తరలిస్తున్నారు. జిల్లా, అదనపు జిల్లా కోర్టులను మున్సిఫ్ కోర్టు భవనంలోకి; ప్రిన్సిపల్, మొదటి అదనపు మున్సిఫ్ కోర్టులు, 3వ అదనపు మెజిస్ట్రేట్ కోర్టులను కనకమహల్ దగ్గర డాక్టర్ గురుదేవి భవనంలోకి; సబ్‌కోర్టు, మొబైల్ కోర్టులను మద్రాసు బస్టాండు దగ్గరున్న రామ్‌సన్స్ భవనంలోకి మారుస్తున్నారు. ఈ ఏర్పాటు తాత్కాలికం!

### దొర్లుడు పుచ్చకాయలు!

కొడవలూరు మండల ప్రజాపరిషత్తు మాజీ అధ్యక్షుడు శ్రీకోడూరు శ్రీరంగారెడ్డి మళ్లీ ఒక రాజకీయ పల్టీకొట్టాడట. నెల్లకూరును వదలి తెలుగు దేశంలో అధికారానికి వచ్చిన శ్రీనల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డిలో చూరాడు; ఆయన మంత్రిగా దిగిపోయిన తర్వాత ముఖ్యమంత్రి అయిన శ్రీ. జనార్దనరెడ్డి పంచన చేరారు; ఆయన వల్ల ఆశించిన లాభం చేతికందకపోగా, అధికారం కూడా పోయినందున ఆయనకు మోచేయి చూపి, మళ్లీ శ్రీనివాసులరెడ్డి గూటిలో చేరారు.

పదవులు, పదవులు, ప్రయోజనాలు ఆశించే రాజకీయ వాదులంతా దొర్లుడు పుచ్చకాయల క్రిందే లెక్క. శ్రీరంగారెడ్డి వంటి వాడికి ఇది తగనిపని. పేరు ప్రతిష్టలు పోయిన మనిషికి విలువే ముంటుంది?

### భద్రతా వారోత్సవాలు- టౌన్‌బస్‌కు ఒకరి బలి!

భద్రతా వారోత్సవమంటూ బ్రహ్మాండంగా జరుగుతున్నది. ప్రచారార్భాటం తప్ప క్రియలో అభద్రతే రాజ్యం చేస్తున్నది.

నెల్లూరు మలేరియా శాఖకు చెందిన వుద్యోగి శ్రీ. ఎం. వెంకట సుబ్బయ్య(35) 5 తేది వుదయం ఎం.జి.బ్రదర్స్ వద్ద రోడ్డు ప్రక్కన సిబ్బంది మస్టర్ తీసుకొంటుండగా '7ఎ' టవున్‌బస్ అతన్ని బలితీసుకున్నది. ఇక భద్రతేమిటి, చట్టుబండలేమిటి?

### పారిశుధ్యవారం

మునిసిపల్ ఆరోగ్యశాఖ పారిశుధ్య వారోత్సవాన్ని జరుపుతున్నది. ఆరోగ్యశాఖాధికారి శ్రీ పి. రామిరెడ్డి, ఆయన సిబ్బంది పరస్పర సహకారంతో సమైక్యంగా ఈ కార్యక్రమంలో పాల్గొంటున్నారు. టవున్‌లోని ఒక్కొ డివిజన్‌కు మొత్తం పారిశుధ్య సిబ్బంది 527 మందిని మళ్లించడం, ఆ వార్డులో మురికి అనేది కలికానికి కూడా కనపడకుండా శుభ్రం చేయడం జరుగుతున్నది. పదకొండు వార్డులలో తొమ్మిది పూర్తి అయ్యాయి. ఈరోజు నిప్పో ప్రాంతం, భక్తవత్సలనగర్ వగైరాలున్న వార్డు పని పడుతున్నారు. వారు ఎంత శ్రమ పడితే మాత్రం ఈ ప్రాంతంలో, వేదాయపాళెం ప్రాంతాల్లో ప్రాథమిక సౌకర్యాలుంటే గదా ఫలిత ముండేదానికి?

### ఆరోగ్యశాఖ సిబ్బంది కృషి :

అభినంద నీయమే కాని దోమలు, ఈగల బాధ అట్లానేవుందే!

కొరవ 6 పేజీలో

### బంగారు

మొదటి పేజీ కొరవ

ఓనరు ఇంటిని కూడా పరిశోధించారంటున్నారు. ఈ ఓనరు మృదు స్వభావమని, ఒక్కసారి ఇంతగా పట్టుబడి నందుకు బంగారు బజారులోని వారందరూ అయ్యో పాపం అంటున్నారని ఒక నగల వ్యాపారస్తుడన్నారు.

ఈ వ్యాపారంలో ఆరితేరిన మరో ప్యాలెస్ వారు ఎల్లవేళలా జాగ్రత్తగా వుండే వారుగా వున్నారు;వారివద్ద పెద్దగా దొరకలేదని వదంతి - 2,3 కిలోల బంగారు, అకౌంటు పుస్తకాలు పట్టుబడినట్లు చెప్పుకుంటున్నారు. ఈ షాపులోని సిబ్బంది తదితరుల ఇండ్లు కూడా సోదా చేశారని, వీళ్ల లెక్కల్లో కనుపరచబడిన వారి ఖాతాదార్లలో కొందరి గ్రామాలకు ఈ బృందంలోని వారు పోయి వున్నట్లు తెలుస్తున్నది. ఈ గ్రామాలలో మహమ్మదాపురం ఒకటని, టవున్‌లో కూడా కొందరు బడా ఖాతాదార్ల మీద వారి దృష్టి వుందని అంటున్నారు.

ఇంకో ప్యాలెస్‌లో బంగారు, కరెన్సీ ఏమీ దొరకలేదని, 6 లక్షల రూపాయల విలువ చేసే షేర్ సర్టిఫికేట్లమా స్వాధీనం చేసుకున్నారని అంటున్నారు.

మరో షాపులో బినామీ పేర్లతో వున్న బ్యాంకుల పాస్ పుస్తకాలు దొరికాయట.

ఇంకో అంగడి యజమానికి పది లక్షల రూపాయల పన్ను వడ్డించారని తెలుస్తున్నది.

ముగ్గురు వ్యాపారుల విలాసాలు కనుక్కోలేక పోయారని అంటారు.

మూడేళ్ల క్రితం సెంట్రల్ ఎక్సయిజ్ డైరెక్టరేట్ (డి.ఆర్.ఐ.) వారి దాడి జరిగిందని, అది ఒక షాపు మీదనే జరిగిందని, బంగారు బిస్కట్లు దొరికాయని, పన్ను వేసివదిలారని తెలుస్తున్నది.

నిన్న మొన్నటి దాడంత పెద్దది ఇటీవలెప్పుడూ జరగలేదని, ఇంత భారీ మొత్తంలో బంగారు వెండి కరెన్సీ మున్నెన్నడూ దొరకలేదని ఒక వ్యాపారస్తుడన్నారు. – మా.ని.

### నాయుడు

మొదటి పేజీ కొరవ

ఇంకేముంది దేశం కాంగ్రెస్ వాళ్లంతా కలియబడి తుక్కు రేగ్గొట్టుకున్నారు. ఎటొచ్చీ ఐక్య వేదిక కాస్తా అనైక్య వేదిక కావడంతో పాపం ఈవాడు రామోజీరావు తల పట్టుకోవల్సి వచ్చింది!

తినగ తినగ వేము తీపన్నట్లు తిట్టగ తిట్టగ శత్రువు మిత్రుడౌతాడేమో?

## నెల్లూరు3వ అ.ము.కోర్టులో

EP 288 of 87 in OS 225 of 82

శ్రీ పాగరేశ్వర స్వామి దేవస్థానం, పూటుకూరు.

రిప్రజెంటెండ్ బై ది మేనేజర్ Vs
-Dhr వారి

1. చిల్లకూరు సుభాషిణి 2. చిల్లకూరు రాధాకృష్ణారెడ్డి3. చిల్లకూరు శ్రీనివాసులు రెడ్డి

Jdrs ప్రతివాదులు

18-1-93తేది పై కోర్టులో ఉదయం.10 గంటలనుంచి సాయంత్రం 5 గంటలలోగా ఈ క్రింది షెడ్యూలు దాఖలా స్థిరాస్థిని బహిరంగముగావేలము వేయబడును. పాడదలచిన వారు పాడుకొనవచ్చును.

ఆస్థివివరము:నెల్లూరు ఆర్.డి. తాలుకా ఇందుకూరు పేట సబ్.రి. ఏరియాలోని ముదివర్తిపాళెం గ్రామంలో మాగాణి పొలం వివరం .

| లాటు నెం. | పట్టానెం. | సర్వేనెం. | విస్తీర్ణం ఎ.సెంట్లు |
|---|---|---|---|
| 1 | 16 | 30c | 0-10 |
| 2 | 16 | 30-E1 | 0-04 |
| 3 | 140 | 30-H | 0-41 |
| 4 | 178 | 43-A | 0-66 |
| 5 | 16 | 43-F1 | 0-12 |
| 6 | 13 | 43-F2 | 0-34 |
| 7 | 16 | 43-G | 0-68 |

కుల్లు 2.35 సెంట్లు హద్దులు: తూ. చిల్లకూరు పిచ్చిరెడ్డి మరియు కాటూరి రమణయ్యల భూమి

ద. ప. :పారుదల కాలువ. ఉ. వాగూరు సుబ్బమ్మ భూమి.

గమనిక:లాటు నెం. 3,4భూమి అడుమానములకు లోబడి యున్నవి. సదరు /. 2-35 సెంట్లు 2,3 Jdr ల స్వాధీనము యున్న లేటు చిల్లకూరు చంద్రశేఖర రెడ్డి అవిభక్త 1/3 భాగము

DHR విలువ-Rs. 8,000/-

అమీనా విలువ-23,500/-

కె. విమల
DHR అడ్వకేటు.

## సణుగుడు

(4 పేజీ కొరవ)

మార్గాలా?మరి దారి కన్నదతం లేదా లెక్కపెట్టి? మూక బలంతో దాష్టీ మసిదును మటుమాయం చేయగల్గిన తాము. ఈ ధోరణిలోనే ప్రతి ఉద్యమాన్ని నడిపి విజయం సాధిద్దామను కుంటున్నట్లున్నారు ఆ పార్టీ కార్యకర్తలు. త్రైలీ లాటరీల కంటే ప్రమాద కర ధోరణి ఇది. ప్రజలకు శత్రువుగా మారిన ఈ దుష్టవ్యాపారాన్ని తుదముట్టించడానికి, నిరసన తెల్పడానికి ఎన్ని మార్గాలు లేవు? అంగళ్ల ముందు ప్రదర్శన జరిపి, వ్యాపారం స్తంభింపచేయవచ్చు; తలుపు తెరవనివ్వకుండా అడ్డుకోవచ్చు; టిక్కెట్ల కొనుగోలుకు వచ్చే అమాయకులకు వాస్తవం చెప్పి వెనక్కు పంపవచ్చు. అంతే తప్ప రౌడీఇజం చేసి, టిక్కెట్లు చించి పారేస్తే అంగళ్లపై దాడిచేస్తే ఉద్యమం ఫలిస్తుందా? పోలీసులొచ్చి తన్ని బయట పారేస్తారు; అంగడి యజమాని మరు క్షణంలో కొత్త టిక్కెట్లు తెచ్చి అమ్ముతారు.

అసలీ వ్యాపారానికి పోలీసులదే పెద్ద రక్షణ అని విన్పడుతోంది. హోల్‌సేల్ వ్యాపారులు స్టేషన్లకు నెల మామూళ్లు చెల్లిస్తూ చిల్లర వ్యాపారులను తమ చిత్తం వచ్చిన తీరులో నియంత్రిస్తున్నారట. తమ మాట వినని వారిని పోలీసుల చేత బెదరిస్తున్నారట.

ఒక స్టేషన్‌కు నెలకు ఒక వ్యాపారి 30 వేల మామూలు చెల్లిస్తున్నాడని చెప్తున్నారు. డిఎస్‌పి, టౌన్ ఇన్స్‌పెక్టర్లు మాత్రం లాటరీలను నిరుత్సాహ పరచడానికి తమ శాయశక్తులా ప్రయత్నిస్తున్నారు; కాని, క్రింది స్థాయి అధికారులు, ఉద్యోగులు తమ శక్తిమేరా పనిచేసి లాటరీలను నిలబెడుతున్నారు.

ముఖ్యమంత్రి, హోం మంత్రులకు ఏమాత్రం ప్రజల పట్ల శ్రద్ధవున్నా, తాము పదవులనుభవించేది ప్రజల దయవల్లనేనన్న స్పృహ వున్నా తక్షణం ఈ త్రైలీ లాటరీలను రాష్ట్రం పొలిమేరలకు తరిమి కొట్టాలి; స్పెషల్ ఆర్డినెన్స్‌లు తెచ్చి అయినా సరే - నిషేధించాలి!

* * *

నెల్లూరు కాంట్రాక్టర్లు ఎక్కడ పాదం పెట్టినా అక్కడ సిరుల పంటే; జిల్లాలో గత ఇరవయ్యేళ్ల ఇవేతల సంపన్నులుగా ఎదిగిన నెల్లూరీయులలో 99 శాతం మంది కాంట్రాక్టర్లే అయి వుంటారు. కేవలం ధన సంపాదనే కాకుండా తామున్న రంగంలో కీర్తినార్జించే నెల్లూరీయులూ వున్నారు. వారిలో జెఎస్ రెడ్డి ఒకరు. బెంగుళూరు నివాసి అయిపోయిన ఈ జగదేవి పేట గ్రామస్తుడు, గుజరాత్‌లోని సర్దార్ సరోవర్ ప్రాజెక్టులో ఉత్తమ కాంట్రాక్టరుగా గుర్తింపు పొంది, ఆ రాష్ట్ర ముఖ్యమంత్రి చేత ప్రశంసలు పొందాడు. నర్మదా నదిపై నిర్మితమౌతున్న ఆ ప్రాజెక్టు ప్రధాన కాలువలో తనకు కేటాయించిన భాగాన్ని జెఎస్ రెడ్డి రికార్డు టైంలో పూర్తిచేశారట. కేవలం నాలుగేళ్లలో 25 కోట్ల పనిచేశాడట. ఆ స్పీడు, నాణ్యతలకు మెచ్చి, ముఖ్యమంత్రి ఛిమన్ భాయ్ పటేల్ సతీసమేతంగా కాలువ దగ్గరకు వచ్చి జెఎస్‌ను అభినందించి వెళ్లారు.

జె ఎస్ రెడ్డి మన ఎమ్మెల్యే శ్రీ జెకె రెడ్డి సోదరుడు.



**సంస్మరణ**



శ్రీ కాళహస్తి రామనాథం గారి ధర్మపత్ని

**జ్ఞానాంబ గారు**

మరణం: 31. 12.90

స్మరిస్తున్న

– కుటుంబసభ్యులు

## సింహపురి

(4 పేజీ కొరవ)

సంఘం ఒక కార్యాలయాన్ని ఏర్పాటు చేసింది. దీనికి డిశంబర్ 25 తేది ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ రాష్ట్ర అధ్యక్షులు శ్రీజాటూరు వేమయ్య ప్రారంభించారు. కార్యకర్తలతోపాటు సంఘం కొత్త అధ్యక్షుడు చీదెళ్ల వెంకటేశ్వర్లు, ప్రధాన కార్యదర్శి వాకాటి తిరుపాల్, రొటేరియన్ వొమ్మిన సుబ్రమణ్యం, పత్తినరసింహులు. ఈ కార్యక్రమంలోపాల్గొన్నారు. గ్రామాల నుండి వచ్చే వైశ్యులకు సహాయపడను కార్యాలయంలో గుమాస్తాను కూడా ఏర్పాటు చేస్తున్నారట. ఇక వినియోగించు కోవాల్సిన బాధ్యత వైశ్య సోదరులదే!

### వికలాంగుల సదస్సు

జిల్లా వికలాంగుల సదస్సు 4తేది ఆచార్య పిసిరెడ్డి అధ్యక్షతన నెల్లూరులోని పెళ్లకూరు అనసూయమ్మ కళ్యాణ మండపంలో జరిగింది. సదస్సును జాతీయ రైతాంగ ఎరువుల సహకార సంస్థ అధ్యక్షుడు శ్రీ పెళ్లకూరు రామచంద్రారెడ్డి ప్రారంభించారు. ఈ సందర్భంగా మాట్లాడుతూ ప్రభుత్వ పక్షంగా వికలాంగుల పునరావాసానికి జరప బడుతున్న కార్యక్రమాలు లాంఛన ప్రాయంగా వున్నందున స్వచ్ఛంద సేవా సంస్థలు వికలాంగులను ఆదుకోవాలన్నారు. జిల్లాలోని వికలాంగుల కాలనీలో మందిర నిర్మాణానికి 'ఇఫ్కో' సంస్థ తరఫున 20వేల రూపాయల విరాళాన్ని ప్రకటించారు.

ఆచార్య పిసిరెడ్డి వికలాంగులు ఎదుర్కొంటున్న కష్టనష్టాలను సభలో వివరించారు. అనంతరం శ్రీరామచంద్రారెడ్డి సంతపేటలోని సాయి పక్షవాత వైద్యశాలను ప్రారంభించారు. ఆరోజా ఉదయం గొలమూడిలోని వెంకయ్య స్వామి విగ్రహ ప్రతిష్టాపన కార్యక్రమంలో కూడా పాల్గొన్నారు.

## జనవాణి

(3 పేజీ కొరవ)

అభిప్రాయం. కాబట్టి వీటి పై కూడా నిషేధం విధించాలి.

– వి.వి.ఎస్. శాస్త్రి
యు.బి. కండ్రిగ

## గ్రంథ సమీక్ష

(4 పేజీ కొరవ)

కావ్యంలోని గొప్ప సుగుణం. 'వాక్యం రసాత్మకం' అన్నట్లుగా హృదయపు లోతుల్ని సున్నితంగా స్పృశించి కదిలించి, గుండెలు బరువెక్కించే కవితలు ఇందులో చాలానే ఉన్నాయి. అలాంటి వాటిలో పేర్కొన దగినవి 'అసమర్థుని జీవయాత్ర' 'రిటైర్మెంటు' 'భాగ్యనగరం గడియారాలు' 'తిరునాళ్ళు' 'పతాక శీర్షిక' 'జ్ఞాపకం మిగిలింది' మొదలైనవి.

భావ కవిత్వానికి ఊపిరితిత్తులైన ప్రేమ కవిత్వం, స్మృతి కవిత్వం ఈ కావ్యంలో వసంత కాలం చెట్టు చివర్న మిగిలిన జంట పువ్వుల్లా పెక్యూలియర్‌గా ప్రత్యక్షమౌతున్నాయి.

ఓనా ప్రియమైన ప్రేమా

'ఎక్కడ నీ అసలైన చిరునామా?' అంటూ నిరీక్షించిన నాగభైరవకు చిట్టచివరికి 'ఖయిస్ ఫియాన్‌లో దేవదాస్ – గ్లాసులో జూలియట్ గ్లోరి, అనార్కలి గోరీ' లలో ప్రేమకి చిరునామాలు కనిపిస్తాయి.

'నిన్నటి నెత్తురు పతాక శీర్షికగా ప్రత్యక్షమౌతుంది' తిరునాళ్ళలో తలలు బాదుకున్న టెంకాయలెన్నో. హుండీలో ముడుచుకున్న రూపాయలెన్నో! – భోళా శంకరుడికేం తెలుసు పాపం! 'అలాంటి పంక్తులు ఎన్నో కవిత్వంతో పండిపోయి మనల్ని పరవశం చేస్తాయి.

ఈ ...ట్లర్ల కాలంలో ప్రచురణలో వచ్చిన విప్లవానికి ఓ దిక్సూచిలా ఉంది ఈ కావ్యం గెటప్!

ముంజేతి కంకణానికి అద్దం ఎందుకనుకున్నారేమో, ఎలాంటి 'ఇంట్రో'లు ఇందులో ఇరికించలేదు నాగభైరవ. పుస్తకం ప్రాప్తి స్థానం చెప్పారు గానీ వెలను మరచారు. పేజీ పేజీలో 'నాగభైరవ' రేఖా చిత్రం దర్శనమిస్తుంది. ఇంత నూతనత్వం మధ్య షరామామూలు 'అంకితం' మాత్రం ఒక్కింత వింతగా ముందుకొచ్చింది. ఇక అచ్చు తప్పులు బాగానే ఉన్నా అవి ఆఫ్‌సెట్‌లో అందంగా ఒదిగిపోయి అంతగా అభాసు చేయడం లేదు. 'ముక్కు తిమ్మనార్య ముద్దు పలుకు' అన్నట్లు నాగభైరవ కవితలో నాజూకు కులుకుల కోసం చదవ్వాలసిన కావ్యం ఇది.

## నెల్లూరు ముచ్చట్లు

5 పేజీ కొరవ

### మెకిన్స్ ఎన్నికలు

నెల్లూరు మెకిన్స్ క్లబ్‌కు కొత్త అధ్యక్షుడు శ్రీ కొండూరు దయాకర రెడ్డి, కార్యదర్శిగా శ్రీ మెట్టా చంద్రశేఖర రెడ్డి గెల్చారు. కార్యవర్గ సభ్యులు వీరూ – పులిమి దినకర రెడ్డి, మేనకూరు సీతారామరెడ్డి, చిల్లకూరు సుధీర్ రెడ్డి, మన్నెమాల కోదండ రామిరెడ్డి, పుచ్చకాయల రాఘవ రెడ్డి, ఎం.వి. ప్రసాద్; అందరూ జెకె, వివేకా జంట అభ్యర్థులే! కె వి ఆర్ వర్గం అనవసరంగా పోటీకి దిగి, పరాజయం పొందింది. కొత్తగా పెద్ద సంఖ్యలో సభ్యులను చేర్చుకుని, మెజారిటీ పొంది వుండినారు గెల్చిన వారు; కోర్టుల మీద ఆశతో కె వి ఆర్ చంద్రయ్య పోటీకి సాహసం చేశారు. కానికోర్టు కొత్త సభ్యులను అనుమతించడంతో పరాభవం మిగిలింది.

### మునిసిపల్ రిజర్వేషన్ వదంతి

నెల్లూరు మునిసిపాలిటీని గిరిజనులకు రిజర్వు చేశారన్న వదంతి, ఒకటి టౌన్‌లో గుప్పుమన్నది. ఒక మాజీ మంత్రి నోటి నుంచి వచ్చినట్లుందీ పుకారు. విచారిస్తే వట్టిదని తేలింది. అసలు రిజర్వేషన్ల ఫైలే పరిశీలనకు రాలేదట.

### ఫోన్ల బాధ దుస్సహం!

నెల్లూరులో టెలిఫోన్ల బాధ దుస్సహంగా వున్నది. ఒక క్షణంలో బాగుంటే మరుక్షణంలో చెడిపోవడం, ట్రంక్‌కాల్సు మాట్లాడుతున్నా మధ్యలో రెండు మూడు సార్లు కట్ కావడం, రాంగ్ నంబర్లు, మొత్తుకున్నా వెంటనే బాగుచేసే నాధుడు లేకపోవడం -అన్ని అవలక్షణాలూ ఆ పెండ్లికొడుకు... అన్నట్లు, అన్ని దుర్లక్షణాలూ వున్నాయి ... ఫోన్లకు.

దయచేసి నెల్లూరు టెలిఫోన్ బాధితులను రక్షించండి బాబూ!

### మరణం

మోదేగుంట పెద్దరైతు కుటుంబీకుడు, పంచ పాండవుల వంటి దేవళ్ల సోదరులలో అగ్రజుడైన శ్రీరామరెడ్డి(75)గుండెపోటుతో 6 తేది దివంగతుడైనాడు. ఆయన కొంత కాలంగా హృద్రోగంతో అస్వస్థులుగా వున్నారు. ఆయనకు ఇద్దరు కుమారులు, నలుగురు కుమార్తెలు వున్నారు.

రామరెడ్డి గారి కుటుంబానికి . వారి సోదరులకు మా ప్రగాఢ సంతాపం తెలియజేస్తున్నాము.

### నీటిమట్టం

| | |
|---|---|
| కనిగిరి రిజర్వాయరు | 17.9 అ |
| సర్వేపల్లి చెరువు | 6.5 అ |
| నెల్లూరు చెరువు | 14.7 అ |

### నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకులు | 9672 | 3,600/- |
| | 9674 | 3,800/- |

## జూబిలీ ఆస్పత్రి నిర్వహణ దారుణంగా వుంది!

# కాన్పుకోసం వెళ్తే కాటికి పంపుతున్నారు!

ధర్మాస్పత్రులలో అధర్మం రాజ్యం చేయడం సహజమే కాని, యమకింకరులు పరిపాలన చేయడం మాత్రం నెల్లూరు ఆస్పత్రులలోనే దర్శనమిస్తుంది. పెద్దాస్పత్రి ఎంత దారుణంగా వుందేది మనకు తెలుసు; దానికి పిల్లాస్పత్రులుగా పనిచేసే జూబిలీ హాస్పటల్, చిల్డ్రన్స్‌హాస్పిటల్లు దాన్ని తలదన్నేవిగా తయారై వున్నాయి.

కేబులాస్పత్రి, కాన్పులాస్పత్రిగా పిలవబడే విక్టోరియా జూబిలీ హాస్పటల్ పరిస్థితి గమనిస్తే ఎవరికైనా ఒళ్లు జలదరిస్తుంది. ఆస్పత్రులను ఎంత అధ్వాన్నంగా నిర్వహించవచ్చుననే అంశంపై పోటీ పెడితే నేషనల్ అవార్డు దానికే అవుతుంది. ఎంత చరిత్ర గల్గిన వైద్యశాల ఇది-ఏ గతి పట్టిపోతున్నది? ఇంగ్లాండు మహారాణి క్వీన్ విక్టోరియా పరిపాలనా ఉత్సవాల స్మారకంగా 1889లో ప్రారంభించిన ఆస్పత్రి ఇది. నెల్లూరులో అప్పుడు ఏర్పడిన 'జూబిలీ

## డాక్టర్లు ఇళ్లలో వుంటే నర్సులు పురుళ్లు పోయాలట!

కమిటీ' మద్రాసు ప్రభుత్వ సహకారంతో, ప్రజల విరాళాలతో ఈ ఆస్పత్రిని నిర్మించింది. స్వాతంత్ర్యం వచ్చే వరకు జిల్లాలో ప్రసవాలకు పేరొందిన సంస్థ ఇదే! ఈ నూరేళ్ల కాలంలో ఎన్ని లక్షల మంది పసికందులు అక్కడ పురుడు పోసుకున్నారో! అంతటి చరిత్ర గల్గిన ఈ సంస్థను ఇప్పుడు యమ సదనంగా మార్చి, ఆపేరు చెప్తేనే జనం భయపడిపోయే పరిస్థితికి తెచ్చారు. ఆ ఆస్పత్రిలో చేరితే బ్రతికి బయటపడడం కష్టమనే 'మంచి' పేరును సంపాదించి పెట్టారు.

అక్కడ పనిచేసే వారిని డాక్టర్లు అని-పిలవడం, ఆ వృత్తికే కళంకం తెచ్చి పెట్టినట్లవుతుంది. అవినీతి, అశ్రద్ధ, అలక్ష్యం, తమనెవరూ ఏమీ చేయలేరన్న అహంభావంతో డాక్టర్లు రోగుల పాలిట యమకింకరుల వలె తయారై వున్నారు. పేరుకు 8 మంది డాక్టర్లున్నారు. డాక్టర్ పి.సరోజిని, సూపరింటెండెంట్, శ్రీమతి పి.విజయలక్ష్మి, కె. పద్మప్రియ, బి.భ్రమరాంబ, పి.నిర్మల, ఎం.ఉమ, పి. భాస్కరరావు ఇతర డాక్టర్లు. వీరిలో మొదటి ముగ్గురు డాక్టర్లకు ఏళ్ల తరబడి బదిలీలు లేవు;ఒకవేళ వచ్చినా ప్రక్క క్షణంలో రద్దయి పోతాయి. అందరికీ బంగారు గనుల వంటి ప్రైవేటు నర్సింగ్ హోంలు వున్నాయి. వారు వాటిని విడిచి రారు. రాలేరు- ప్రభుత్వ ఉద్యోగమూ వదలుకోరు! ప్రైవేటు ప్రాక్టీసు చేసుకుంటే తప్పులేదు- అది తప్ప ఆస్పత్రికి వచ్చే అలవాటు మానుకోవడమే ఈ హాస్పిటల్ దుర్గతికి కారణం. ప్రతి డాక్టరూ, సెలవు పెడితే తప్ప- మధ్యాహ్నం రెండు వరకు ఆస్పత్రిలో విధిగా వుండాలని రూలు. కాని దాన్ని ఎవరూ పాటించరు. ప్రైవేటు ప్రాక్టీసులో నిమగ్నమై వుండే నలుగురు డాక్టర్లు వారానికి ఒకసారి ఆస్పత్రి ముఖం చూస్తే ఎక్కువట. తమ స్వంత క్లినిక్‌లలో తీరిక దొరికినప్పుడు, ఏమీ తోచనప్పుడు మధ్యలో చూపుగా వచ్చిపోతుంటారట. జీతం మాత్రం ఉత్రుడియంగా దిగమ్రింగుతుంటారు. ఆస్పత్రి నిబంధనల ప్రకారం ఇరవై నాలుగు గంటలూ ఒక డాక్టరు అందుబాటులో వుండాలి. అది జరగడం లేదు. సూపరింటెండెంట్ గారు మాత్రం అధిక సమయం ఆస్పత్రిలో గడిపేట్టున్నారు. లేకున్నా ప్రక్కనే ఇల్లు కాబట్టి, అత్యవసరమైతే పిలవగానే వస్తారట. కాని ఆమె ఒక్కతే ఎందరు పేషెంట్లను చూడగలదు. డాక్టర్ల నిర్బాధ్యత, డ్యూటీ ఎగ్గొట్టే అలవాటు వల్ల అధికభాగం కాన్పులను నర్సులే జరిపించేస్తున్నారు. దాని ఫలితమే ఆస్పత్రిలో ప్రసవాల సంఖ్యకు పోటీగా చావుల సంఖ్య వుండడం! మొన్నటికి మొన్న ఇద్దరు యువతులను అన్యాయంగా పొట్టన పెట్టుకున్నారు.

గతవారంలో నెల్లూరుకు చెందిన యువతిని కాన్పుకోసం ఆస్పత్రిలో చేర్పించారు. ఆపరేషన్ చేసి బిడ్డను తీయాలని డాక్టర్లు నిర్ధారించారట. కాని ఆ తర్వాత ఆమెను అట్లే వదిలేసి వెళ్లి పోయారు. సాయంత్రం ఆమెకు నొప్పులు వచ్చాయి. సమయానికి డాక్టరు లేదు. నర్సులే పురుడు పోసేశారు. కాన్పుచేయడంలో లోపం వల్ల బ్లీడింగ్ ప్రారంభమైంది. అత్యవసర మందులు ఇవ్వడానికి కనీసం స్టోర్‌రూం తాళం కూడా లేదట. ఆ యువతి కోమాలోకి వెళ్లిపోయింది. సూపరింటెండెంట్‌ను పిలిస్తే ఆమె వచ్చిచూసి, ప్రమాదకరంగా వుందని మాత్రం చెప్పి వెళ్లిపోయిందట. ఆ తర్వాత రాత్రి కెప్పుడో డ్యూటీ డాక్టరు వచ్చి, పరిస్థితి గమనించి, ఆక్సిజన్ పెట్టాలని చూస్తే సిలిండరు లేదు. పక్కనే వున్న మరొక రోగికి తగి[..]న



సిలిండర్‌ను తెచ్చి ఈమెకు పెట్టారట. కొద్దిసేపటికి ఇద్దరు రోగులూ చనిపోయారు. సమయానికి సిలిండర్ లభ్యమైవుంటే, కనీసం ఆ రెండవ యువతి అయినా బ్రతికివుండేది.

ఆస్పత్రి ఎంత దౌర్భాగ్యంగా తయారై వుందో తెలుసుకోవడానికి నిర్లక్ష్యంతో పేషెంట్ చనిపోతే అది ఖచ్చితంగా హత్యక్రిందకు వస్తుంది; ఆ డాక్టరు హంతకిగా పరిగణించోతుంది. ఆపరేషన్ చేసి బిడ్డను తీయాలని భావించిన తర్వాత నర్సుల చేత కాన్పు చేయించడం ఎంత ఘోరం? ఆ సమయంలో డ్యూటీలో వుండవలసింది-

## చావులు సహజమే – అశ్రద్ధతో చంపితేనో?

ఇంతకంటె నిదర్శనం అవసరంలేదు. ఇంత దారుణమేమిటమ్మా అని మా విలేఖరి, సూపరింటెండెంట్‌ను అడిగితే- ఆస్పత్రుల్లో చావులుండవటండీ అని సమాధాన మిచ్చారు. చావులు వుండవచ్చు కాని, చంపడాలు వుండకూడదని జ్ఞానం ఆమెకు తెలిసినట్లు లేదు. డాక్టర్ల ప్రయత్నం విఫలమై పేషెంట్ చనిపోతే ఎవరికీ అభ్యంతరం లేదు. కాని డాక్టర్ల డాక్టర్ భ్రమరాంబ గారట. కాని ఆమె ఇంటికి వెళ్లి పోయారు; తిరిగి రాలేదు. పేషెంట్ పరిస్థితి ప్రమాదకరంగా వుందని తెలిసిన తర్వాత అయినా ఆమెను పిలిపించి వుండాల్సింది; కాని పిలవలేదు; ఆమె ఆ తర్వాత అసలు ఆస్పత్రికే రాలేదు. ఈ చావుకు బాధ్యత ఖచ్చితంగా ఆమెదే; ఇతర దేశాలలో అయితే ఆమెను

కాడవ 8 పేజీలో

### పగలు మగవాళ్లు వెళ్లలేరు – రాత్రుళ్లు ఆడవాళ్లకు భయం

# అల్లూరు ఆర్టీసి బస్టాండు గతి అదీ!

అల్లూరు ఆర్టీసి బస్టాండ్ ప్రజలకు అందుబాట్లో లేక పోవడం వల్ల అది ఉండీ లేనట్లుంది. ముఖ్యంగా బస్టాండ్ నుండే రాకపోకలు సాగిస్తున్న కావలి డిపో బస్సుల మూలంగా మహిళలు, వుద్యోగులు, వ్యాపారస్తులు తీవ్ర అసౌకర్యానికి గురవుతున్నారు. అల్లూరు ప్రజల చిరకాల కోరిక తీర్చను ఎమ్మెల్యే శ్రీకె.విష్ణువర్ధనరెడ్డి తన తండ్రి స్వర్గీయ ఆదినారాయణరెడ్డి పేర బస్టాండ్ నిర్మించను రెండున్నర ఎకరాల స్థలం ఉచితంగా ఇచ్చారు. ఈ స్థలానికి ముందు కాలేజి ఆటస్థలం, మరో పక్క స్మశానం వుండడంతో దారి సమస్య పుట్టుకొచ్చినా దాన్ని అధికారులు అధిగమించారు. 92 జూన్ 3 తేది అప్పటి ముఖ్యమంత్రి శ్రీ ఎన్.జనార్దనరెడ్డి చేతుల మీదుగా దీన్ని ప్రారంభించారు. కాని మూడు నెలల వరకు అక్కడి నుండి ఏ బస్సు నడపలేదు; కారణం ప్రాథమిక సౌకర్యాలు కల్పించక పోవడమే! మూడు నెలల తర్వాత విద్యుత్ సౌకర్యం కల్పించారు. మరో రెండు నెలల తరువాత అక్కడికి బస్సులు రావడం ప్రారంభమయ్యింది. దీన్ని వినియోగంలోకి తీసుకరావడానికి నెల్లూరు డిపో బస్సులుపేట బస్టాండ్‌లో ఆగడం మానేస్తే, కావలి బస్సులు ఏకంగా ఏ స్టేజీలోనూ ఆగక బస్టాండ్‌లోకే పోతున్నాయి. దీనివల్ల ప్రజలకు కష్టాలు ఆరంభమయ్యాయి. అదిగాక బస్టాండ్ చుట్టుపక్కల ఇళ్లేవీ లేక పోవడంతో పాటు

### జిల్లావార్తలు

ఒక పక్క శ్మశానం, మరో పక్క [illegible] కాలువ [illegible] తయారయ్యాయి. ఉదయం పూట ఈ బస్టాండ్‌కు వెళ్లాలంటే సాహసం చేయాల్సిందే. [illegible] ఈ ప్రాంతం బహిర్భూమిగా వాడుతుండడం వల్ల మగవాళ్లే వెళ్లలేరు. ఇక మహిళల సంగతి చెప్పక్కరలేదు. ఇకపోతే ఆర్టీసి -పంచాయితీ వివాదం మూలంగా ఈ మార్గాన విద్యుత్ దీపాలు వేయను పంచాయితీ అనుమతి నిరాకరించింది. బస్టాండ్‌కు వెళ్లేదారి తమ పేర రాసివ్వమని డిమాండ్ చేసింది. దీనితో రాత్రి 7 గంటలు దాటగానే చిమ్మచీకటి క్రమ్మి ఈ దారిన పోయేందుకు ఆడవాళ్లు భయపడుతున్నారు. అసలు మెయిన్ రోడ్డునుండి బస్టాండ్ వరకు వేసిన మట్టిరోడ్డులో పడుతూ లేస్తూ పోయే బస్సులో ఆరోగ్యవంతులకైనా నడుములు పట్టుకోవడం ఖాయం. బస్టాండ్‌ను సాకుగా పెట్టుకొని కావలి డిపో బస్సులు వేలాది మంది ప్రయాణీకులు తీవ్ర ఇబ్బందులు పడుతున్నా బస్టాండులోకి వచ్చి తిరిగి వెళ్లి పోతున్నాయి. ఇక్కడి నుంచి ముసలి, ముతక జనం కనీసం [illegible] సౌకర్యం లేకపోవడంతో నానా తిప్పలు పడుతున్నారు. [illegible] బస్టాండ్ స్టాపింగ్ తీసివేసినా నెల్లూరు వంటి డిపో బస్సులు బస్టాండ్ ముఖద్వారం ముందైనా ఆగేలా చూడాలని పేట ప్రజలు [illegible] ఎవరికీ చెవి కెక్కడం లేదు. బస్టాండ్ సమస్య ఇలా వుంటే దాని [illegible] బస్సుల సంఖ్య కూడా అల్లూరు ప్రజలను

## జిల్లావార్తలు

(7 పేజీ కొరవ)

నిషిస్తున్నది. ప్రైవేట్ బస్సులు నడిచే సమయంలో ఈ దారిలో 27 బస్సులు తిరిగేవి. ప్రస్తుతం జనాభా పెరిగినా దానికి బట్టి బస్సులు పెరగాల్సింది పోయి నెల్లూరు డిపో నుంచి 17 బస్సులు కావలి డిపో నుంచి 5 మాత్రమే నడుస్తున్నాయి. వీటిలో ప్రతిరోజూ కొన్ని రద్దయిపోతాయి. కావలి డిపో నుంచి నడిచే బస్సుల పరిస్థితి అక్కడి డిపో మేనేజర్‌ను అడిగినా ప్రయోజనం ఉండదంటారు. నెల్లూరు డిపో వారైతే నెల్లూరు నుంచి రాత్రి 10 గంటల పైన వున్న సర్వీసును రద్దుచేసి పారేశారు. 9.30 పైన వందలాదిమంది ప్రయాణికులు ఆత్మకూరు బస్టాండ్‌లో పడే పాట్లు చెప్పనలవికాదు. దానికి తోడు అరుగు మీద పేరుకు పోయిన చెత్తా చెదారాలతో బస్సులు మునిసిపాలిటీ చెత్త తొట్టిలా వున్నాయి. ప్రతి రోజూ బస్‌లో ఎక్కిన ప్రయాణీకులు అల్లూరు నుండి ఆత్మకూరు బస్టాండ్ వరకు దుస్థితి గూర్చి మాట్లాడుకోవడం రాజకీయ నాయకులను నిందించడం పరిపాటయ్యింది. అయినా స్పందించిన నాయకుడే లేడు.

### పోలేరమ్మ తిరునాళ్లు

జిల్లాలో వెంకటగిరి పోలేరమ్మ జాతర తరువాత వైభవంగా జరిగే అల్లూరు పోలేరమ్మ తిరునాళ్లు 5వతేది ఘనంగా జరిగాయి. చుట్టు పక్కల గ్రామాల నుండి వేలాది మంది తరలి రావడంతో పేటలోని దేవ స్థానానికి వెళ్లే వీధులన్నీ కిట కిటలాడాయి. అర్ధరాత్రి ప్రారంభమైన గ్రామోత్సవానికి ప్రత్యేక తరహాలో చేసిన పుష్పాలంకరణ పలువురిని ఆకర్షించింది.



నాగబంధం పేరిట ఏర్పాటు చేసి కాల్చిన బాణా సంచాతో తిరునాళ్లకు వచ్చిన ప్రజల చెవుల తుప్పు వదిలింది. సాంప్రదాయ బద్ధంగా వున్న మాతంగి కన్యల నృత్యం తో పాటు పలు సాంస్కృతిక కార్యక్రమాల హుషారులో యువతరానికి పట్టపగ్గాల్లేకుండా పోయాయి. నాటుసారా మంచినీళ్లలా అడ్డు అదుపులేకుండా ప్రవహించింది.

### మకరజ్యోతి వుత్సవం

తుమ్మగుంట అయ్యప్పస్వామి దేవస్థానంలో సంక్రాంతి పండుగ పర్వదినాన్ని పురస్కరించుకొని మకరజ్యోతి దర్శన కార్యక్రమం ఏర్పాటయ్యింది. దీనితో పాటు, ప్రత్యేక పూజలు, గ్రామోత్సవం జరుగుతుందట.

### ఐ.ఆర్.డి.పి. యూనిట్లు మంజూరు

రాపూరు మండలానికి ఐ.ఆర్.డి.పి. పథకం క్రింద 200 యూనిట్లు మంజూరు చేసినట్లు డి.ఆర్.డి.ఎ. ప్రాజెక్ట్ డైరక్టర్ ఆదిత్యనాథ్ దాస్ చెప్పారు. రాపూరు సిండికేటు బ్యాంకు వీటికి ఆర్థిక సహాయం అందజేస్తుందని, లబ్దిదారుల ఎంపిక కోసం ఏప్రెల్ మొదటి వారంలో గ్రామ సభలు నిర్వహిస్తామన్నారు. యూనిట్లలో వేపినావి, మెట్టపల్లి గ్రామాలకు 20 పంగిలి 25, నెల్లటూరు 10, సంకురాత్రి 10, ఏపూరు 25, సైదాదుపల్లి 5, దాచూరు, గోను నరసాపాళెం, మునగాల వెంకటాపురాలకు 45 యూనిట్లను లక్ష్యంగా పెట్టుకొన్నట్లు చెప్పారు.

### సబ్సిడీలో పురుగు మందులు

రాపూరు మండలంలో చిన్న, సన్నకారు రైతులకు సమగ్ర అభివృద్ధి పథకం క్రింద పురుగు మందులను సబ్సిడీపై పంపిణీ చేస్తున్నట్లు వ్యవసాయాధికారి వి. నరసింహులు చెప్పారు. క్లోరో ప్రైరో కాన్, మెటాసిడ్, జింక్ సల్ఫేట్, బాలిస్టన్ మందులు 25 శాతంలో సబ్సిడీతో ఇచ్చేందుకు కార్యాలయంలో సిద్ధంగా వున్నాయన్నారు.

### కోడి పందేల జోరు

రాపూరు మండలంలోని పలు గ్రామాల్లో ఇటీవల కోడి పందేలు జోరుగా సాగుతున్నాయట. ఇంతకు ముందు సంక్రాంతి పండుగను పురస్కరించుకొని జరిగే పందేలు ప్రస్తుతం జూదం మాదిరిగా రూపాంతరం చెందాయి. పండుగ, పబ్బాలే కాకుండా మిగతా రోజుల్లో కూడా వేలాది రూపాయల పందేలు వేస్తూ పోటీలు పడి వీటిని గ్రామస్తులు నిర్వహిస్తున్నారు. మండలంలో సైదాదు పల్లి, లింగపాళెం, సిద్ధవరం, గోనుపల్లిలలో ప్రతిరోజూ వీటిని యధేచ్ఛగా నిర్వహిస్తున్నా అరికట్టే నాథుడే లేకుండా పోయాడు.

### మార్కెటింగ్ యార్డు లేని గూడూరు

పలు వ్యాపారాలకు కూడలియైన గూడూరు టౌన్‌లో వ్యవసాయ మార్కెటింగ్ యార్డ్ లేనందున ఈ పరిసర గ్రామాల రైతులు ఇబ్బందులు పడుతున్నారు. ఈ ప్రాంతం నుండి ధాన్యం, నిమ్మ, మిరప, వేరుశెనగ, నువ్వులు తదితర వస్తువులు దిగుమతి అవుతుంటాయి. వీటి కొనుగోలు వ్యవహారాలు మధ్యవర్తులే నిర్వర్తిస్తుంటారు. పేద రైతుల నుండి అతి తక్కువ ధరకు కొని, మారు బేరంలో అధిక ధరలకు అమ్ముతుంటారు. ఇందు వల్ల నష్టపోయేది రైతన్నలే. గిట్టుబాటు ధర రాకున్నా అవసర నిమిత్తం తెగనమ్ము కోవలసిందే. వీటితో పాటు ఇక్కడ లక్షల రూపాయలకు పైగా విలువైన గొర్రెలు, మేకలు, పశువుల క్రయ విక్రయాలు జరుగుతుంటాయి. ఈ వ్యాపార లావాదేవీల వల్ల గూడూరు వ్యవసాయ మార్కెటింగ్ కమిటీకి పన్నుల రూపంలో సాలీనా రూ. 10 లక్షల రూపాయల వరకు వస్తుంది. ఇంత భారీ వ్యాపారం సాగుతున్నా ఇక్కడ మార్కెట్ యార్డ్ ఏర్పాటుకు తగిన శ్రద్ధ వహించక పోవడం దారుణమని రైతులు వాపోతున్నారు.

ప్రతి శుక్రవారం గూడూరులో జరిగే గొర్రెల సంతలో వ్యాపారులకు తగినంత భద్రత లేదని వ్యాపారులు ఆవేదన వ్యక్త పరుస్తున్నారు. గతంలో శ్రీ గోపాల్ రెడ్డి సంతను పట్టణానికి దూరంగా పూరి బయట తన పొలంలో ఏర్పాటు చేసి, లైట్లు వేయించి నామ మాత్రపు పన్ను వసూలు చేయించేవాడని, అది కొందరు తెలుగుదేశం వారికి ఒప్పక రద్దు చేయించడంతో అప్పటి నుంచి కయ్యల్లో తాము ఈ గొర్రెల క్రయవిక్రయాలు జరుపుతున్నామని రైతులు చెబుతున్నారు. ప్రస్తుతం గూడూరువ్యవసాయ మార్కెటింగ్ కమిటీకి శ్రీ ఎల్లసిరి గోపాల్ రెడ్డి ఛైర్మన్ గా నియమింపబడినందు వల్ల ఆయన హయాంలో అయినా ఇక్కడ మార్కెట్ యార్డు నిర్మించాలని రైతులు కోరుతున్నారు. అది గనక ఇక్కడ నిర్మిస్తే మధ్య దళారీల చేతుల్లో తాము మోసపోకుండటమే కాకుండా తమ ఉత్పత్తులకు తగిన గిట్టుబాటు ధర లభించి మార్కెట్ కమిటీకి రాబడి రెండింతలవుతుందని సలహా కూడా ఇస్తున్నారు. యువకుడు, ఉత్సాహవంతుడైన శ్రీ గోపాల్‌రెడ్డి చొరవ తీసుకొని మార్కెట్ యార్డ్ గూడూరులో నిర్మింప చేస్తారని రైతులాశ, వారి ఆశ నిరాశ కాకూడదని ఆశిద్దాం.

### రామ్మా సంక్రాంతీ!

**జయంపు కృష్ణ**

అప్పులు చేసిన మా ఇంటాయన
కుప్పకూలి స్పృహ తప్పాడు-
పెళ్ళయిన మా పెద్దబ్బాయి
వేరే కాపురం అంటున్నాడు-
చిన్నోడేమో పరీక్ష తప్పి
నౌకరి సుడిలో పడిపోయాడు-
చిన్నది నిన్ననే పెద్ద మనిషయ్యి
మూలకూచుని సిగ్గంటున్నది-
కూలి చేసి నే తెచ్చిన నూకలు
కుండ అడుక్కి రానేలేదు-
అల్లుడు వస్తే సారాలోకి
కోడి కూర కావాలంట-
కూతురు చూస్తే ఏడవలేక
సారా పోరు సాగిస్తోంది-
రామ్మా సంక్రాంతి రా!
అయినా
బతుకు మీద ఆశ చావలేదు
ఒంటిలో చేవమిగలనే లేదు
ఏనాటి కయినా ఆయన లేవడా?
పెద్దోడికి నేను గుర్తుకు రానా??
చిన్నబ్బాయి డబ్బు తీసుకరాడా??
చిన్నమ్మికి పెళ్లి కాక పోతుందా?
అల్లుడి మత్తు దిగకుంటుందా?
కూతురి కోరిక ఫలించదా?
అప్పుడు చూడు!
నా ఇంట
ఎంత పండుగ జరుగుతుందో!
నా కంట
ఎంత కాంతి వెలుగుతుందో !!

### డిపాజిట్లు కట్టిస్తే ఇళ్లు మంజూరు

సర్పంచ్‌లు బాధ్యత వహించి ప్రజల చేత డిపాజిట్లు కట్టిస్తే ఇళ్ల కాలనీలు మంజూరు చేయిస్తానని రాపూరు ఎమ్మెల్యే నువ్వుల వెంకట రత్నం నాయుడు సర్పంచ్‌లకు హామీ ఇచ్చారు. 29 తేది మండలానికి విచ్చేసిన ఆయనను సర్పంచ్‌లుకాలనీల విషయం అడిగితే, బాధ్యతవారిపైనే పెట్టారు. సిద్ధవరంలో గిరిజనులకు మంజూరు చేసిన 20 ఇళ్లు, జోరేపల్లి అక్కమాంబపురంలో 40 ఇళ్లు, రామదేవిపల్లిలో 32 ఇళ్లు మంజూరు చేయించినా డిపాజిట్లు కట్టక పోవడం వల్ల నిరుపయోగ మై పోయాయని ఆవేదన వ్యక్త పరిచారు. నియోజక వర్గాల అభివృద్ధికి మంజూరు అయిన 25 లక్షల రూపాయల నిధుల్లో బలహీన వర్గాలకు ఇళ్లు కట్టించుకోను వెయ్యి రూపాయలు మంజూరయ్యేలా ప్రయత్నం చేయగలనని ఎమ్మెల్యే వాగ్దానం చేశారు.

### డక్కిలి నాటుసారా బట్టీలపై దాడులు

డిసెంబర్ 1 తేది 'జమీనారైతు' పత్రికలో వెలువడ్డ 'డక్కిలిలో నాటుసారా' వార్తకు ఎక్సైజ్ శాఖాధికారులు స్పందించారు. మండలంలో పలుచోట్ల దాడులు చేసి వివిధ గుర్తుల ప్యాకెట్లలో సరఫరా అవుతున్న సారా పట్టుకొన్నారు. మండలం కేంద్రంలో మాత్రం ఈ దాడులు జరిగాయి. కొండ క్రింద గ్రామాల్లో ఇంకా నాటుసారా తయారీ యధేచ్ఛగా జరుగుతున్నట్లు తెలుస్తుంది. ఈ నాటు సారా తయారీకి గతంలో తుమ్మ చెక్క వాడేవారు. కాని ఇటీవల సల్ఫేటు ద్రావకం, చెడిపోయిన పండ్లు, మరిగిన అన్నం వాడుతున్నట్లున్నారు. ఇది త్రాగిన వారి ప్రాణానికే ప్రమాదం ఏర్పడేట్లుంది.

### జూబిలి ఆస్పత్రి

(7 పేజీ కొరవ)

హంతకిగా కోర్టుకు ఈడ్చివుండేవారు. మనం జీతమిచ్చి, గౌరవిస్తాం! ఇంత నిర్లాధ్యంగా వ్య... ంచే డాక్టర్లకు శిక్షలేదా? కనీసం అడిగేవారు లేరా? ఆస్పత్రిలో ఐదు ఆక్సిజన్ సిలిండర్లున్నట్లు ఆ రోజు స్టాక్ రిజిష్టర్‌లో నమోదైవుంది, అటువంటప్పుడు రెండవ సిలిండర్ దొరకక మరొక పేషెంటుకు పెట్టిన సిలిండర్ ఎందుకు తీయవలసి వచ్చింది? ఆస్పత్రిలోని సిలిండర్లనూ డాక్టర్లు తమ ప్రైవేట్ ఆస్పత్రులకు తరలిస్తున్నారా? ఆస్పత్రిలో బ్లడ్‌బ్యాంక్ ఒదికాని బ్లీడింగ్ జరిగిన యువతికి రక్తం ఎక్కించలేక పోయారు. కారణమేమిటి? రక్తాన్ని కూడా అమ్ముకుంటున్నారా?నయంచచ్చిన శవాలను విక్రయించ కుండా, బంధువులకు అప్పచెప్తున్నారు;దానికి ఈ వైద్యశిరోమణులకు వందనాలు చెప్పాలేమో! పేషెంటు బలహీనంగా వుండడం వల్ల చనిపోయిందని సూపరింటెండెంట్ గారి సంజాయిషీ.

అంత బలహీనంగా వుండిన పేషెంట్‌కు నర్సులచేత ఎందుకు కాన్పు జరిపించారు? ఉన్నతాధికారులెవరైనా ఈ దారుణంపై విచారణ జరపకూడదా ?

యథా రాజా తథా ప్రజ ;డాక్టర్లు అట్లా వుంటే, సిబ్బంది ఇంకెట్లా వుంటారు? అక్కడ పని చేసే నర్సులకు హృదయం వుందా లేక ఆస్పత్రికి వచ్చేటప్పుడు ఇంట్లో పెట్టి వస్తారా అన్నది సందేహం! మధ్యాహ్నం నుంచి నర్సులదే రాజ్యం. డాక్టర్లెవరూ వుండరు. ఈ విలేఖరి ఆస్పత్రిలో వున్నప్పుడే పురుటి నొప్పులు పడుతుండిన ఒక మహిళను చూడడానికి రమ్మని ఆమె భర్త నర్సులను ప్రాధేయపడుతుండినాడు. కన్నీళ్ల పర్యంతంగా పిలుస్తుండినాడు. అయినా వారు కదిలితే కదా? రోజూ ఇటువంటి దృశ్యాలు సర్వసాధారణం ఇక్కడ. డబ్బులివ్వనిదే ఏ పనీ చేయరిక్కడ. ప్రతి పనికీ రేట్లుంటాయి. లేబర్ రూంలోకి తీసుక వెళ్లాలన్నా, ప్రసవం తర్వాత బల్ల దింపాలన్నా, పట్టుకుని రావాలన్నా, బిడ్డకు స్నానం చేయించాలన్నా, బొడ్డు కోయాలన్నా లంచం ఇవ్వాల్సిందే. ఆస్పత్రికి వచ్చేది 99 శాతం నిరుపేదలు. రిక్షా వాళ్లు, వ్యవసాయ కూలీలు, బీడీ కార్మికులే అధికంగా వస్తుంటారు. అందులో సగం మంది ముస్లింలు. వారు డబ్బెక్కడ నుంచి తెస్తారు? సిబ్బంది అడిగింది ఇవ్వక పోతే ఛీత్కారాలు, చీదరింపులు తప్పవు. కన్నీళ్లు పెట్టి ప్రాధేయపడడమూ తప్పదు. మందులదీ పెద్ద గోల్మాల్. ప్రతి ప్రిస్కిప్షన్‌కు పది రూపాయలు జత చేర్చి చెల్లిస్తే గాని మందులు లోపల నుంచి బయటకు రావు.

ఆస్పత్రి వాతావరణమూ చీదరగా వుంటుంది. భవనం పాత పడిపోవడం వల్ల గోడలన్నీ చెమ్మపట్టి పెచ్చులూడుతున్నాయి. వానకురిస్తే అంతా ఉరుపే. రెండో వార్డు ప్రక్కనుండే గది శిథిలమైపోయింది. ఎక్కడా లైట్లు వెలగవు. కటిక చీకటి. వైరింగు కాలిపోయిందట; లైట్లు మాడిపోతున్నాయట. రాత్రిళ్లు లోపలుండే మహిళల బాధ వర్ణనాతీతం. భయం, భయంగా, బిక్కు బిక్కుమంటూ కాలం గడుపుతుంటారు.

పరిస్థితి ఇంత అధ్వాన్నంగా వున్నా పేషెంట్ల రద్దీ మాత్రం అపరిమితం. నెలకు కనీసం 3 వేల మంది పేషెంట్లు వస్తుంటారు. వారిలో 800 మంది ఆస్పత్రిలో చేర్తారు. 30ఆపరేషన్ల వరకూ జరుగుతుంటాయి. ఉండేది 90బెడ్లే. అవి ఏమూలకూ చాలవు. సీజన్‌లో క్రింద కూడా పడక వేయాల్సివస్తున్నదట. కొత్త బిల్డింగ్ నిర్మాణం పూర్తిచేసి, పడకల సంఖ్య కనీసం రెండు వందలకు పెంచితే తప్ప ఆస్పత్రి ప్రజల అవసరాలను తీర్చలేదు.

(పిల్లలాస్పత్రి వివరం పైవారం)

### పంచాంగము

తేది 13 బుధవారము భోగి పండుగ
తేది 14 గురువారము సంక్రాంతి పండుగ
తేది 15 శుక్రవారము కనుమ పండుగ

**జనవరి తిథులు**

పుష్యబహుళ

తే 9 శని పాడ్యమి సా.గ. 4.25 వ
తే 10 ఆది విదియ ప.గ. 2.26 వ
తే 11 సోమ తదియ ప.గ. 12.14వ
తే 12 మంగళ చతుర్థి ప.గ. 10.00వ
తే 13 బుధ పంచమి ఉ.గ. 7.45 వ
తరువాత షష్టి రాత్రి గం. 4.35
తే 14 గురు సప్తమి రా.గ. 3.30 వ
తే 15 శుక్ర అష్టమి రా.గ. 1.30 వ

స్వయంపాకుల శ్రీనివాసులు

రియల్ హీరో చిరంజీవే! | హీరోయిన్లలో మీనా రికార్డు | రిలీజ్ 105, హిట్ పదిలోపే!

# 92 లో తెలుగు సినిమా తీరుతెన్నులు!

1992 సంవత్సరంలో మొత్తం 105 తెలుగు చిత్రాలు విడుదలయ్యాయి. ఫిబ్రవరి, సెప్టెంబర్ నెలల్లో 11 చిత్రాలు విడుదలయ్యాయి. కథానాయకుల పరంగా చూస్తే ఎన్టీరామారావు -1, నాగేశ్వర రావు - 4, శోభన్ బాబు - 2, కృష్ణ - 1, దాసరి నారాయణ రావు - 6, చిరంజీవి - 2, నాగార్జున - 3, బాలకృష్ణ - 3, మోహన్ బాబు - 5, రాజశేఖర్ - 2, రాజేంద్ర ప్రసాద్ - 7, సుమన్ - 5, వినోద్ కుమార్ - 7, నరేష్ - 4 చిత్రాల్లో నటించారు.

## మీనా రికార్డ్

హీరోయిన్లలో వర్తమాన యువనటి మీనా 9 చిత్రాల్లో నటించి రికార్డు స్థాపించింది. యమున కూడా - 9 చిత్రాల్లో నటించింది. వాణీ విశ్వనాథ్ - 7, శోభన - 7, రోజా - 5, విజయశాంతి - 3, జయసుధ - 3, నగ్మా - 2 చిత్రాల్లో నటించారు.

## 40 సినిమాల్లో బ్రహ్మానందం

ఈ యేడాది విడుదలైన 105 చిత్రాలకు గాను 40 చిత్రాల్లో నటించి హాస్యనటుడు బ్రహ్మానందం సరికొత్త రికార్డు స్థాపించాడు. బాబూమోహన్, కోట శ్రీనివాస రావు చెరి 36 చిత్రాల్లో నటించి బ్రహ్మానందంతో పోటీ పడ్డారు. దర్శకులలో కె. రాఘవేంద్ర రావు, దాసరి నారాయణ రావు, కోడి రామకృష్ణ, ఇ.వి.వి. సత్యనారాయణ నాలుగేసి చిత్రాలకు దర్శకులుగా పనిచేయగా నెల్లూరీయుడు ముత్యాల సుబ్బయ్య ఐదు చిత్రాలకు పని చేసి దర్శకుల్లో ప్రథమ స్థానం పొందాడు.

సంగీత దర్శకుల్లో రాజ్-కోటి - 17 కీరవాణి - 13, ఇళయరాజా - 12 చిత్రాలకు సంగీతం సమకూర్చారు.

## ఒక హిట్‌తోనే అందనంత ఎత్తుకు చిరంజీవి

92 లో కేవలం ఒకే ఒక సూపర్ డూపర్ హిట్ చిత్రంలో నటించి హీరోల్లో రియల్ హీరోగా చిరంజీవి రికార్డు స్థాపించారు. ఆయన నటించిన ఘరానామొగుడు, ఆపద్బాంధవుడు చిత్రాల్లో ఒక చిత్రం ఘనవిజయం సాధించడంతో భారత సినీ పరిశ్రమలో ఏ నటుడూ తీసుకోనంత పారితోషికం తీసుకొంటున్నారన్న ఖ్యాతి లభించింది. బాలకృష్ణ నటించిన మూడు చిత్రాల్లో ధర్మక్షేత్రం ఫ్లాప్ కాగా, రౌడీ ఇన్స్‌పెక్టర్ హిట్ అయ్యింది. అశ్వమేధంకు యావరేజ్ టాక్ వుంది. నాగార్జున విషయానికొస్తే కిల్లర్ యావరేజ్, అంతం ఫ్లాప్ అయినా ప్రెసిడెంటు గారి పెళ్లాం సూపర్ హిట్ అయ్యి అతనికి ఎనలేని పేరు తెచ్చింది. మోహన్ బాబుకు అల్లరిమొగుడు, రాజశేఖర్ అక్కమొగుడు, అక్కినేని నాగేశ్వర రావు కాలేజీ బుల్లోడు వంటి హిట్ చిత్రాల్లో నటిస్తే యువనటుడు వెంకటేష్ మూడు రీమేక్ చిత్రాల్లో నటించినా నా వాటిలో చంటి సూపర్ హిట్ అయ్యి అతనికి మంచి పేరు తెచ్చింది.

## మరికొన్ని విశేషాలు

సంచలన దర్శకుడు వేజెళ్ల సత్యనారాయణ, నిర్మాత రాఘవేని ప్రకాశరావు ఈ సంవత్సరం మరణించారు. [illegible]



చిట్టెమ్మ మొగుడు చిత్రంలో దివ్యభారతి, మోహన్‌బాబు, బ్రహ్మానందం

అమల ప్రేమజంట దంపతులు కాగా జూన్ 4 తేదీ నెల్లూరులో అప్పటి ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్దన రెడ్డి నేతృత్వంలో నంది అవార్డుల ప్రధానోత్సవం ప్రప్రథమంగా జరిగింది. తమిళనాడు ముఖ్యమంత్రి కుమారి జయలలిత ఆనాడు ముఖ్యఅతిథిగా విశేషం.

## [illegible]త్వం [illegible]ంచిన చిత్రాలు

ముత్యాల సుబ్బయ్య - 5, కోదండరామిరెడ్డి - 3, పి.ఎన్. రామచంద్రరావు - 1, సింగీతం శ్రీనివాస రావు - 1 చిత్రాలకు దర్శకత్వం వహించారు.

బుచ్చిరెడ్డిపాలెం వాస్తవ్యుడు నిర్మాత ఎ.ఎం. రత్నం తొలిసారిగా 'పెద్దరికం' చిత్రానికి దర్శకత్వం నెరపారు.

## అక్కినేని ఆవేదన

గడిచిపోయిన '92 గూర్చి చెప్పమంటే మహానటుడు అక్కినేని నాగేశ్వర రావు ఒక్కసారిగా ఆవేదన వ్యక్తపరిచారు. ఈ సంవత్సరాన్ని చెడు కలిగించిన సంవత్సరంగా పేర్కొనాలి. మొన్న జరిగిన బాబ్రీ మసీదు గొడవ వల్ల దేశానికి ఎంత చెడు జరిగిందో మనకు తెలుసు. మతాల పేరుతో కొట్టుకు చావడమంటే మనం ఎంత మూర్ఖత్వంలో వున్నామో అర్థం చేసుకోవాలన్నారు డాక్టర్ అక్కినేని.

## రాజేంద్రప్రసాద్ శాంతి ప్రసంగం

డిసెంబర్ 24 తేదీ హైదరాబాద్‌లో సినీతారల శాంతి యాత్ర సందర్భంగా కులీ కుతుబ్ షా మినీ స్టేడియంలో హీరో రాజేంద్రప్రసాద్ చేసిన శాంతి ప్రసంగం పలువురిని ఆకట్టుకుంది. తనదైన బాణీలో ' సుజాతా... మై మర్‌జాతా, తు అవ్వా బట్టల సత్తిగాడు బువ్వా' అనగానే ప్రేక్షకులంతా ఒక్కసారిగా గొల్లున నవ్వారు. చూశారా నేనలామాట్లాడగానే కులాలు మతాలు మర్చిపోయి హాయిగా నవ్వేశారు. మన జీవితాలు కూడా నవ్వులాగే కులమతాలకు అతీతంగా ఉండాలన్నారు రాజేంద్రప్రసాద్.

## పరచూరి సోదరులు

### ఇక నుంచి బూతులు వ్రాయరట!

జంట రచయితల్లో ఒకరైన పరచూరి వెంకటేశ్వర రావు ఇటీవల ఒక సందర్భంగా మాట్లాడుతూ నిజమే తెలుగు సినిమాల్లో బూతు మాటలు ఎక్కువగా చోటు చేసుకొంటు న్నాయన్నారు. ఇటీవల మేం రాసిన ఒక చిత్రంలో బూతులు మా ప్రమేయం లేకుండా వచ్చాయి. ఏది ఏమైనా ఇక నుండి మా చిత్రాల్లో బూతులకు తావుండదన్నారాయన. ఈ మాట నమ్ముదామా?

## ఎంత చూసినా ఏమి చూసేదీ అర్థం కాని అద్భుత దర్శకత్వం

# గ్యాంగ్‌వార్

చిత్రసమీక్ష — అల్లూరు రహీం

ఒకప్పుడు ద్వంద్వార్థపు సంభాషణలు నింపి చిత్రాలు తీసి రికార్డు స్థాపించిన దర్శకుడు కోడి రామకృష్ణ వయిలెన్స్ వేవ్‌లో కూడా రికార్డు స్థాపించను తీసిన తాజా చిత్రమే 'గ్యాంగ్‌వార్'. చిత్రంలోని ప్రతి రీల్‌లో పొడవాటి కత్తులతో కుత్తుకలు కసుక్కున తెగిపోయి రక్తం ఏరుల్లా ప్రవహిస్తుంది. మంచి నీళ్లు తాగినంత సునాయాసంగా మర్డర్లు. మాట మాటకు మధ్య రౌడీ గ్యాంగుల బాహా బాహీ పోరాటాలను 'బిబి' అంటూ ఆశ్చర్య పోతూ చూడాల్సిందే. అందువల్లే సెన్సార్ బోర్డు మొదట ఈ చిత్రానికి అనుమతివ్వలేదు. దర్శకుడు పత్రికలకెక్కి నానా గొడవ చేశాక 'కత్తెర'కు బాగా పనిచెప్పి చివరికి అనుమతించారు. దీనివల్ల కొన్ని సీన్లు వేగంగా మాయమై పోతుంటాయి. 'నోర్లు కదులుతున్నా మాటలు వినపడవు. తరచూ ఫిలిమ్ రంగు మారడం, క్లైమాక్స్ అయితే ముచ్చటగా మూడు నిమిషాల్లో ముగిసి పోతుంది. పాపం ఇదంతా సెన్సార్ వాళ్లే చేశారని దర్శకుడు చెప్పినా కథ కాకుండా మిగిలివున్న భాగాల్లోని సన్నివేశాలను కూడా రక్తి కట్టించలేక పోయాడు. గూండాల భరతం పట్టను ఎ. ఎస్.పి స్థాయి అధికారిణి చేత చిందు యించి ఇది రామకృష్ణ మార్కు తెలుగు సినిమా అని పించారు. రౌడీ హీరో చేత ఆదర్శం కోసం రౌడీయిజం చెలాయిస్తున్నట్టు చెప్పించారు. మొత్తానికి చివరి రీల్‌లో నీతి చెప్పాలని రౌడీ గ్యాంగుల బీభత్స 'సమాజం కంటే స్మశానంలో శాంతి వుందని చెప్పి చేతులు దులుపు కోను ప్రయత్నించారు. గీతాంజలి తరువాత స్టయిల్ చిత్రానికి మాటలు వ్రాసిన రాజశ్రీ మాటల్లో పదను మినహా చిత్రంలో మరే ప్రత్యేకతా లేదు. కథ కు సంబంధం లేకుండా నడిపిన కామెడీ ట్రాక్ ఒకరకంగా చిత్రాన్ని కొద్ది సేపు చూసేలా చేసింది. ఈ సినిమాకు వెళ్ళిన ప్రేక్షకులు ఏదో అర్థంకాని సినిమాను చూశామన్న భావనతో తిరిగి వస్తే ఆశ్చర్యపోనక్కరలేదు.

కథలోకి వెళితే ఆసిటీలో పేరు మోసిన గుండా గ్యాంగులకు ఎ.ఎస్.ఆర్.కె. చౌదరి (కోటశ్రీనివాసరావు), నారాయణమూర్తి (నిర్మాత అశోక్ కుమార్), వెంకటరత్నం (వర్తమాన నటుడు, సైటిల్స్‌లో పేరుచూపలేదు) నాయకులు. ఎత్తులకు పై ఎత్తులు వేసుకొనే ఈ గ్యాంగులలో చౌదరి గ్యాంగు ఎమ్మెల్యే కూడా అయిన వెంకటరత్నంను హత్యచేసి, ఆ సమయంలో అటుగా వచ్చిన ప్రభు (భానుచందర్) పై ఆ నేరం మోపుతుంది. మూర్తి గ్యాంగ్ ప్రభును శిక్షనుండి కాపాడే సరికి వెంకటరత్నం కొడుకు జగన్(వినోద్‌కుమార్) తన తండ్రి మరణానికి ప్రభు కారకుడని భావించి అతన్ని అంతమొందించాలని ప్రయత్నిస్తుంటాడు. కాల క్రమేణా గ్యాంగు నాయకులు వెనబడిపోయి జగన్, ప్రభు పైకొచ్చి వారివారి ఏరియాల్లో అడ్డు అదుపులేకుండా గుండా గిరి చెలాయిస్తుంటారు. ఆ సమయంలో ఎఎస్‌పిగా సిటికి వచ్చిన పవిత్ర(శోభన) వారిని సంస్కరించాలని ప్రయత్నిస్తుంది. ఒకసారి చౌదరి గ్యాంగు జగన్ భార్య కావేరి(కస్తూరి)ని అంతమొందించా లన్నప్పుడు ప్రభు రక్షిస్తాడు. ఈ సంఘటన నేపథ్యంలో ఎఎస్‌పి పవిత్ర రెండు గ్యాంగులను కలపాలని చూస్తే చౌదరి మళ్లీ అవి కలవకుండా బీభత్స కాండ సృష్టిస్తాడు. వెంకటరత్నం చనిపోయి నందువల్ల జరిగే ఉప ఎన్నికల్లో చౌదరి ఇచ్చిన హామీల మేరకు జగన్ అతనికి మద్దతిస్తే, మూర్తి మనిషికి ప్రభు మద్దతు ఇవ్వడంతో మళ్లీ గ్యాంగ్ వార్ ఆరంభ మవుతుంది. ఎఎస్‌పి పవిత్ర ఎన్నికల ముందురోజు ఇద్దర్ని అదుపులోకి తీసుకున్నా చౌదరిగ్యాంగు అభ్యర్థి హత్య చేయడంతో ఎన్నికలు ఆగిపోతాయి. జగన్ మతి చలించిన అనుచరుని ద్వార అతని తండ్రి హత్యకు ప్రభు కారణం ... 

కొంత 10 పేజీలో

## నిర్మాతల కడుపుమంట

### సెన్సారాఫీసరు పీడెప్పుడు విరగడౌతుందో!

అభ్యంతర కరమైన సన్నివేశా లున్నా గతంలో పైరవీల ద్వారా సెన్సార్ కార్యక్రమాన్ని సులభతరం చేసుకోవచ్చని నిర్మాతలుఅనుకుంటూంటే వారు. కైలాస్ ప్రసాద్ సెన్సార్ బోర్డ్ ప్రాంతీయాధికారిగా పదవి బాధ్యతలు చేపట్టినదాదిగా దొడ్డి దారులకు మూతపడింది. అసభ్య పదాలకు, అశ్లీలమైన సన్నివేశాలకు, అసహ్యకరమైన సైటిల్స్‌కు ఆయన అడ్డుకట్ట వేసి ఎక్కువ మంది ప్రశంసలందుకున్నా, కొందరు నిర్మాతలు మాత్రం తమకు మానసిక క్షోభను కల్గించిన ఆ అధికారికి స్థానభ్రంశం కల్గితే బాగుంటుందని కోరుకుంటున్నట్లు తెలుస్తోంది.

## పినాకిని తీరం

(2 పేజీ తరువాయి)

### గ్రీటింగులు తగ్గాయి

ఈ సంవత్సరం న్యూ ఇయర్ గ్రీటింగులు బాగా తగ్గింది. మాకు తగ్గడం కాదు. అమ్మకాలు కూడా చాలా తక్కువని అంగళ్లవాళ్లు అసంతృప్తి వ్యక్తం చేస్తున్నారు. నూతనసంవత్సర శుభాకాంక్షలు స్నేహ పరిచయ బంధాలను సంవత్సరానికొకసారైనా పునరుద్ధరించు కోవడం, గుర్తు చేసుకోవడం మంచి సాంప్రదాయమే కాని, పసి పిల్లలకు కూడా వ్యాపించిన ఈ వేస్తు తగ్గడం మాత్రం శుభసూచకే!

మాజీ ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్ధన రెడ్డి ఏ పదవి లేక ముందు అందాలు చిందే గ్రీటింగు కార్డులు పంపేవారు. మంత్రి అయ్యాక, మరి ముఖ్యమంత్రి అయ్యాక ఆయనలో ఆ ఉత్సాహం తగ్గిపోయినట్లుంది; పాపం సిబ్బా అధికారిక కార్డు వేస్తున్నది. ఈ సంవత్సరం ఆయన నినాదం LETUS BE SECULAR AND HUMAN అనేది. ఈ సంవత్సరం ఒక విశేషం అయన సతీమణి శ్రీమతి రాజ్యలక్ష్మి పేరు కూడా చేరడం. 91-92 రాజ్యలక్ష్మమ్మ జీవితంలో ఒక స్వర్ణ అధ్యాయం; పేరు సార్థకం చేసిన కాలం! మాకు అందరి కంటే ముందుగా అందింది. ఒక రోజు ముందుగానే వచ్చింది. శ్రీ పనల పెంచలయ్య గారి శుభాకాంక్షలు; చిత్రవర్ణాల చిత్రరువులతో ముచ్చటగా వున్న కార్డు అది! చిన్న పత్రికల ప్రకటనల విషయంలో ఇంకా చిన్న చూపుగా వున్నా, సమాచార శాఖ ప్రత్యేకత ఆ కార్డులో నీడలు తెలుతున్నది.

పార్లమెంటు సభ్యురాలు కుమారి పద్మశ్రీ కొత్తదనం వదలి, పార్లమెంటు సభ్యురాలుగా పాతకాపు అయింది ఆమె 'బెస్ట్ విషస్' మెటిక్యులస్ గా వున్న పార్లమెంటు భవనం బొమ్మతో సింపుల్‌గా వుంది. కో ఆపరేటివ్ బ్యాంకు అధ్యక్షుడు శ్రీ వేమారెడ్డి దర్జా న్యూ ఇయర్ కార్డులో కనపడదు; అర్ధాంగి బైపాస్ ఆపరేషన్ వల్లనేమో మరీ సాదాగా వుంది. జ్ఞాపికగా ఎటువంటి డైరీనెమి! చక్కెర ఛైర్మన్ పాముంతు సుబ్బారెడ్డి గ్రీటింగు తియ్యగా లేదు!

కీ.శే. అల్లాడి మహాదేవయ్య - అన్నపూర్ణమ్మ గారల అవివాహిత కుమార్తె, ప్రసూతి వైద్య ప్రావీణ్యతలో తండ్రిని మించిన తనయ అనిపించుకున్న డాక్టర్ అల్లాడి లక్ష్మీదేవి నెల్లూరు వదలి చాలా కాలమైంది; మనుషులు దూరమైతే స్వస్థానం, స్వజనం దూరం కారు గదా! శుభ సౌభాగ్యాలను ఆకాంక్షించే ఆమె కార్డు బహుకాలానికి కనుపించడం ఎంతో సంతోషమైంది. వేషభాషల్లో నడక నాణ్యతలో, వాస్తు శిల్పంలో తనదైన సొంత అభిరుచులు కల్గిన డాక్టర్ జె.వి.రెడ్డి గ్రీటింగు కార్డు ఆ ప్రత్యేక ధోరణికి భిన్నంగా ఎట్లా వుంటుంది - 1993 లో 'మిమ్ములను కరుణిస్తాననే' హామీ యిస్తున్న శివ్విగ్రహం చిత్రంతో విశిష్టంగానే వుంది! సూర్యకాంతిని సద్వినియోగం చేసుకోమంటున్నారు అంతర్జాతీయ శాస్త్రజ్ఞుడుగా గుర్తింపు పొందిన నెల్లూరీయుడు డాక్టర్ ఎ. జగదీష్. జవహర్లాల్ నెహ్రూ టెక్నలాజికల్ యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్ డాక్టర్ బి. రాజ గోపాలరెడ్డి నెల్లూరు మిత్రులను మరచి పోలేదు. మా సాహితీ మిత్రుడు, కావలి జవహర్ భారతి తెలుగు శాఖాధిపతి డాక్టర్ జె.వి. సుబ్బరాయుడు గారి ఇంగ్లీషు పలకరింపులో ఆత్మీయత వుట్టిపడుతున్నది.

'అక్షరతృష్ణ' శ్రీ జయంపుకృష్ణ "కోరేది మానవత్వం. చేరేది సమానత్వం" అంటాడు. రెండవది మాత్రం అక్షరాలా నిజం! మాటల్లో నిప్పులు కక్కే అనంతరామయ్య గ్రీటింగు చేతుల్లో శాంతి పావురాన్ని ఎగురవేస్తున్నది; అందులో సహృదయ స్ఫూర్తిగా వుంది. "చీల. కర్రు" వ్యాపారంతో విసిగి, కొత్తదనానికి బహు విద్యా సంస్థల నిర్వహణ భారాన్ని సజావుగా మోస్తూ, ఎప్పుడూ 'ఫ్రెష్' గా, చురుగ్గా, సంతోషంగా వుండే వైశ్య సంఘోద్ధారకుడు, రోటేరియన్ శ్రీ పొమ్మిన సుబ్రహ్మణ్యం గ్రీటింగు "నన్ను చూడు, నా రూపం చూడు" అంటూ విశిష్టంగా వుంది. గ్రామాధికారులకు వుద్యోగాలను సాధించిన యోధుడు రాష్ట్ర సంఘ అధ్యక్షుడు శ్రీ దేవళ్ల దశరథరామిరెడ్డి పేదూరులో కూర్చొని తానున్నా నంటున్నాడు! రచయిత, కాలేజి లెక్చరరు శ్రీ తిరుమూరు సుధాకర రెడ్డి, కావలి అడ్వొకేటు - శ్రీ బి.వి. రమణారెడ్డి, శ్రీ తేరే రాయప్ప - ఆయన డాక్టర్ల జంట, లారీ ఓనర్ల అసోసియేషన్ సెక్రటరీ శ్రీ ఆర్. నాగేంద్ర రావు ప్రభృతులెందరో నూతనవత్సర శుభాకాంక్షలు తెలియజేశారు. రోజూ ఇంకా వస్తూనే వున్నాయి.

జమీన్‌రైతు దూరాన వున్నా వారు మరచిపోలేదు, మేమెట్లా మరుస్తాము? - కందుకూరులో పెద్దాస్పత్రి నిర్వహిస్తూ పేదసాద పట్ల సానుభూతి హృదయంతో సేవజేస్తున్న డాక్టర్ వి. వై. కోటారెడ్డి - సుబ్బలక్ష్మమ్మ, వారి కుమారుడు కోడలు డాక్టర్ వి. శివకుమార్ రెడ్డి - డాక్టర్ మృదుల; సహకార శాఖ సీనియర్ అధికారి, నెల్లూరీయుడు శ్రీ ఎం. గోపాలరావు మున్నగు వారు కూడా హాపీ న్యూ ఇయర్ అంటున్నారు.

అందరికీ మా వందనాలు.

## గ్యాంగ్ వార్

(9 పేజీ తరువాయి)

తెలుసుకొనే సరికి జగన్, ప్రభు లిద్దరికీ న్యాయస్థానం పురిశిక్ష విధిస్తుంది. పవిత్ర తన వృత్తి ధర్మానికి తిలోదకాలిచ్చి న్యాయం కోసం కోసమంటూ వారిని కస్టడీ నుండి విడిపించడంతో దారి -మూర్తిలను వారు అంత మొందించడంతో గ్యాంగ్‌వార్ ముగుస్తుంది.

చిత్రంలోని ఒక సీన్‌లో ఎన్నికలు జరిగే సమయంలో గదిలోకి గొర్రెలను తోలుకొనివచ్చిన ఎఎస్‌పి పవిత్ర ఐరేమిటని ప్రభు, జగన్‌లు అడిగితే ప్రజాస్వామ్యంలో ఓటర్లంటూ ఎద్దేవా చేయడం వంటి సన్నివేశం ప్రస్తుత పరిస్థితులకు అద్దం పట్టింది.

చిత్రం చివర సెన్సార్ కత్తెర బాగా పడడంతో రెప్పపాటు కాలం పలు ముఖ్య సన్నివేశాలు అతిగతి లేకుండా అయిపోతాయి. రాజశ్రీ మాటలు బలంగా వున్నా భువనచంద్ర, జొన్నవిత్తుల పాటలు ఇంపుగాలేవు. 'వలపు కిదే ప్రేమాయనమః' పాట పరవాలేదు. రాక్-కోటిల రణగొణులతో చెవులకు తూట్లు పడడం ఖాయం. సాహుల్ ఫైట్స్‌లో ప్రతిభ చూపాడు. నటుల్లో వినోద్‌కుమార్ క్యారెక్టర్ ఫిట్‌నెస్‌గా పోషిస్తే భానుచందర్ ఫైట్స్‌లో ప్రతిభ చూపాడు.

## గూడూరు సబార్డినేటు జడ్జి వారి కోర్టులో

E.P. No. 1 of 1991 / O.S. No. 136 of 1987

వాది (D.H.R) — ప్రతివాది (J.D.R)

Andhra Bank, Menakur represented by its Branch Manager — గట్టమనేని శ్రీనివాసులు నాయుడు

యీ క్రింద కనుపరచిన J.D.R. కు హక్కు అనుభవము గల షెడ్యూలు దాఖలా స్థిరాస్తిని 27.1.1993 తేది ఉదయం 10.30 గంటల నుంచి పై కోర్టు వారి ఆవరణములో కోర్టు వారిచే బహిరంగముగా యాలం వేయబడును. పాటదారులు హాజరై పాడుకొనవచ్చును.

**షెడ్యూలు** నెల్లూరు రి. డి. నాయుడు పేట సబ్ రిజిష్ట్రేషన్ లో చేరిన ఓజిలి మండలంలోని పున్నేపల్లి గ్రామంలో ప్రతివాది (J.D.R) కు హక్కు అనుభవం గల స్థిరాస్తి వివరం

| వరుస | పట్టానెం. | సర్వేనెం. | పూర్తి విస్తీర్ణము | J.D.R. కు హక్కు అను భవం గల విస్తీర్ణం | మెట్ట లేక మాగాణి |
|---|---|---|---|---|---|
| 1 | 191 | 18/6 | య. 3.17 ట్లు | య. 1.06 ట్లు | మెట్ట |

య. 1.06 ట్లకు హద్దులు: తూర్పు: వరవపోరంబోకు; దక్షిణం: యేనుగుల రామానాయుడు భూమి; పడమర: గట్టమనేని రంగమ్మ భూమి; ఉత్తరం: కొట్లపాటి గాంధి నాయుడు భూమి

D.H.R. కిమ్మత్తు రూ. 10,000.00 — అమీనా కిమ్మత్తు రూ. 20,000.00

| వరుస | పట్టానెం. | సర్వేనెం. | పూర్తి విస్తీర్ణము | J.D.R. కు హక్కు అను భవం గల విస్తీర్ణం | మెట్ట లేక మాగాణి |
|---|---|---|---|---|---|
| 2 | 191 | 18/7 | య. 3.48 ట్లు | య.1.24 ట్లు | మాగాణి |

య 1.24 ట్లకు హద్దులు: తూర్పు: యాతముక్కల సుబ్రహ్మణ్యం నాయుడు భూమి; దక్షిణం: వావిళ్ళ రమణయ్య నాయుడు భూమి; పడమర: గుజ్జలపూడి రామచంద్రనాయుడు భూమి.

D.H.R. కిమ్మత్తు రూ. 13,000.00 — అమీనా కిమ్మత్తు రూ. 26,000.00

| వరుస | పట్టానెం. | సర్వేనెం. | పూర్తి విస్తీర్ణము | J.D.R. కు హక్కు అను భవం గల విస్తీర్ణం | మెట్ట లేక మాగాణి |
|---|---|---|---|---|---|
| 3 | 191 | 100/4 | య. 0.19 ట్లు | య. 0.19 ట్లు | మాగాణి |

D.H.R. కిమ్మత్తు రూ. 1,900.00 — అమీనా కిమ్మత్తు రూ. 2,850.00

| వరుస | పట్టానెం. | సర్వేనెం. | పూర్తి విస్తీర్ణము | J.D.R. కు హక్కు అను భవం గల విస్తీర్ణం | మెట్ట లేక మాగాణి |
|---|---|---|---|---|---|
| 4 | 191 | 99/2-A | య. 1.36 ట్లు | య. 1.36 ట్లు | మాగాణి |

D.H.R. కిమ్మత్తు రూ. 13,000.00 — అమీనా కిమ్మత్తు రూ. 27,000.00

NOTE: పై నెంబరు 2 వ అయిటములో అరుమానం పెట్టిన య. 0.36ట్లు భూమి ఏనుగుల రమణయ్య భూమి. J.D.R.ఆస్తికాదు.

పి. ప్రభాకర శాస్త్రి
Advocate for D.H.R.



కన్నుల కదలాడే కొంటె చూపు అంతరార్థం
కేకు తిన్పించినందుకు కృతజ్ఞతా భావమా,
కోరనున్న 'రాజ్యలక్ష్మి' సగం వాటాకు సంకేతమా?
(జనవరి 1 తేది 'జనప్రియ' లో అర్ధాంగికి ప్రేమ పూర్వకంగా కేకు తిన్పిస్తున్న జనార్ధన రెడ్డి)

## ఓబులరెడ్డి

(2 పేజీ తరువాయి)

చెన్నారెడ్డి నాయకత్వంలో రెండేళ్లు. డాక్టర్ చెన్నారెడ్డి పాత రోజుల్లో రంగాగారి అభిమాని. ఆ సంబంధంతో కాబోలు జ్ఞాపకంగా మంత్రి వర్గంలోకి తీసుకున్నారు. చెన్నారెడ్డి మంత్రిత్వ విరమణ తర్వాత ఓబులరెడ్డి గారు అజ్ఞాత రాజకీయ నాయకుడై పోయారు. ప్రస్తుతం ఆయన కుమారుడు నాగార్జున రెడ్డి కంభం శాసనసభ్యుడు.

మంత్రిగా వుండినా ఆయన ఎంత నిరాడంబరుడో, నిగర్వి, మామూలుగా వుండే వారో ఒక్క సాదృశ్యం చెప్తే తెలుస్తుంది. కర్నూలులో వ్యవసాయ మంత్రిగా వుండగా నెల్లూరు జిల్లా పర్యటనకు వచ్చారు. ఒక రాత్రి పామూరులో బస. ఆయన రాత్రి విశ్రాంతికి మోపాడు రిజర్వాయరు గెస్ట్ హౌస్‌ను ఎన్నుకోలేదు. అందరితో పాటు ఒక సత్రంలో కుక్కి నులక మంచం మీద ఆరు బయట, హాయిగా నిద్రపోయారు. మనిషి రిజర్వుడుగా కనిపించినా, పెద్ద పదవుల్లో వున్నా ప్రత్యేక సౌకర్యాలను కోరుకునే వాడు కాదు; కార్యకర్తలలో ఒకరుగా కలసి మెలిసి పోయే వాడు.

జమీన్‌రైతుకు, రామానాయుడు గారికి సన్నిహితుడు ఓబులరెడ్డి గారు. జమీన్‌రైతు కుటుంబంలో ఒకరుగా ఆత్మీయంగా వుండే వ్య. వ్యక్తిగతంగా నన్ను సొంత తమ్ముడుగా అభిమానించే వాడు ఆయన. 1956 కర్నూలు, 1978 హైదరాబాదు మంత్రిత్వాల మధ్యకాలంలో నాకు అరుదుగా తప్ప ఓబులరెడ్డి గారిని కలసుకునే అవకాశం కలుగలేదు. అయినా తాను మంత్రిగా వున్నప్పుడు నేను ఎం.ఎల్.సి. నయ్యాను. ఆ సందర్భంలో ఓబులరెడ్డి గారు తన అధికార నివాసంలో విందు జేశారు; లాంఛనంగా, నామకార్థంగా కాదు - హాజరైన అతిథులు అధికంగానే వుండినారు. ఓబులరెడ్డి గారికి అన్ని విధాలా చిన్నవాణ్ణయిన నా మీద అంతగా ప్రేమాభిమానాలుండినాయా అని నాకు ఆశ్చర్యం కల్గింది; అంతటి గొప్ప మనసు ఆయనది.

మరచి పోలేని వ్యక్తి శ్రీ ఓబులరెడ్డి. ఆయనకు నా బాష్పాంజలి.

— శ్రీ రామమూర్తి

కావ్యంలోని గొప్ప సుగుణం. 'వాక్యం రసాత్మకం' అన్నట్లుగా హృదయపు లోతుల్ని సున్నితంగా స్పృశించి కదిలించి, గుండెలు బరువెక్కించే కవితలు అందులో చాలానే ఉన్నాయి. అలాంటి వాటిలో పేర్కొన దగినవి 'అసమర్థుని జీవయాత్ర' 'రిటైర్మెంటు' 'భాగ్యనగరం గడియారాలు' 'తిరునాళ్ళు' 'పతాక శీర్షిక' 'జ్ఞాపకం మిగిలింది' మొదలైనవి.

భావ కవిత్వానికి ఊపిరితిత్తులైన ప్రేమ కవిత్వం, స్మృతి కవిత్వం ఈ కావ్యంలో వసంత కాలం చెట్టు చివర్న మిగిలిన జంట పుష్పాల్లా పెక్యూలియర్‌గా ప్రత్యక్షమౌతున్నాయి.

ఓనా ప్రియమైన ప్రేమా

'ఎక్కడ నీ అసలైన చిరునామా?' అంటూ నిరీక్షించిన నాగభైరవకు చిట్టచివరికి 'ఖయిస్ ఖయాస్‌లో దేవదాస్ - గ్లాస్‌లో జూలియట్ గ్లోరీ, అనార్కలి గోరీ' లలో ప్రేమకి చిరునామాలు కనిపిస్తాయి.

'నిన్నటి నెత్తురు పతాక శీర్షికగా ప్రత్యక్షమౌతుంది' తిరునాళ్ళలో తలలు బాదుకున్న టెంకాయలెన్నో, హుండీలో ముడుపుకున్న రూపాయలెన్నో! - భోళా శంకరుడికేం తెలుసు పాపం! 'ఇలాంటి పంక్తులు ఎన్నో కవిత్వంతో పండిపోయి మనల్ని పరవశం చేస్తాయి.

ఈ కంప్యూటర్ల కాలంలో ప్రచురణలో వచ్చిన విప్లవానికి ఓ దిక్సూచిలా ఉంది ఈ కావ్యం గెటప్! ముంజేతి కంకణానికి అద్దం ఎందుకనుకున్నారేమో, ఎలాంటి 'ఇంట్రో' లు ఇందులో ఇరికించలేదు నాగభైరవ. పుస్తకం ప్రాప్తి స్థానం చెప్పారు గానీ వెలను మరచారు. పేజీ పేజీలో 'నాగభైరవ' రేఖా చిత్రం దర్శనమిస్తుంది. ఇంత నూతనత్వం మధ్య పరామాములు 'అంకితం' మాత్రం ఒక్కింత వింతగా ముందుకొచ్చింది. ఇక అచ్చు తప్పులు బాగానే ఉన్నా అవి ఆఫ్‌సెట్‌లో అందంగా ఒదిగిపోయి అంతగా అప్‌సెట్ చేయడం లేదు. 'ముక్కు తిమ్మనార్య ముద్దు పలుకు' అన్నట్లు నాగభైరవ కవితలో నాజూకు కులుకుల కోసం చదవ్వలసిన కావ్యం ఇది.

## 50 ఏళ్ళ క్రితం

3 పేజీ తరువాయి



Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Nellore OFFSET Printing at Nayagara Books (Pvt) Ltd.